# ఆత్మసప్రశ్నే

(మొదటి సంపుటము.)

జ్ఞానప్రవాహినీప్రచురణసంఘమువారిచే
ప్రకటింపబడినది.

సర్వస్వామ్యసంకలితము.

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు
కే. బి. కృష్ణారావుచే
ముద్రింపబడినది.

1915.

వెల రు 0-4-0.

# అంకితము.

ఈ చిన్ని పుస్తకము
ఆర్థిక శాస్త్రవేత్తయు,
రాజ్యాంగనీతికోవిదుడును, స్వార్థత్యాగియు,
విద్యాభిమానియు, భారతదేశభక్తాగ్రగణ్యులలో
నొక్కఁడునై విలసిల్లిన
లోకమాన్య
గోపాలకృష్ణ గోఖలె గారికి
భక్తిపూర్వముగ
సమర్పింపబడినది.

# విజ్ఞప్తి

గుంటూరు తాలూకా యేటుకూరు గ్రామము నందలి "జ్ఞానప్రసాదినీ" పుస్తకభాండాగారపక్షమున 1913 సంవత్సరము సెప్టంబరు 10వ తేదీన "ప్రస్తుత హిందూదేశీయులవిద్య, దాని నభివృద్ధిచేయు విధము" అను నొకవ్యాస మచ్చువేయింపబడి పంచిపెట్టబడినది. ఆప్రకారమే మరికొన్ని వ్యాసముల ను ప్రకటింపవలయునని ఆగ్రంథభాండాగారమువారు తలచియు, కొన్నికారణములచే నట్లొనర్పజాలకపోయిరి.

పిమ్మట అట్టి కరపత్రములను వీలగునెడ పక్షమునకొకమారును, లేనిచో మాసమున కొకటివంతునను ప్రకటించి చదువనేర్చినవారి కెల్లరకును, అందజేయుచుండవలెనను ఉద్దేశముతో మా ఈ "జ్ఞానప్రసాదినీప్రచురణసంఘము" మేర్పరుపబడినది. తాము ప్రకటించిన కరపత్రమునెడ దమకుగల సర్వాధికారమును మాకే వదలివేసిన పైభాండాగారమువారికి మేమెంతయు కృతజ్ఞులము.

మేము ప్రకటింపనెంచిన వ్యాసములన్నియు, కొంచెముగ తెలుగుభాషచదువనేర్చి, కొంతయనుభవముకలిగియున్న సామాన్యజనులందరకును, ఉన్నతపాఠశాలల(HighSchools)లలో విద్యనభ్యసింపుచు, ఇంకను కళాశాలల (Colleges లో) జేరని విద్యార్థులకును, ఉపయోగపడవలయునని మాకోరిక.

కాని కొంచెమయినను చదువకపోవుటచే తూర్పు పడమరల నెరుగజాలక, దురదృష్టవశమున హైందవజన సామాన్యమునం దెక్కువభాగమగు నక్షరజ్ఞానశూన్యుల నిట్టి కరపత్రములచేత నే విద్యావంతులుగ నొనర్చి, అభివృద్ధికి దేగలుగుదుమని మే మెన్నడు ననుకొనియుండలేదు. అట్టివారివిషయమున, తీరికయును, ఉత్సాహమును గల యౌవనులు గ్రామములవెంబడి తిరిగి, విసువుగొనక ప్రతిసంగతిని విపులముగ, ఉదాహరణములతో వివరించి చెప్పిననే తప్ప ఫలముకలుగదని మాకు బాగుగ తెలియును.

తెలుగుభాషయందు వెనుకటికాలమున నేమాత్రమును లేదని చెప్పనగు వచనరచనను ప్రారంభించుటయేగాక, ఉపయుక్తములగు వ్యాసములను, చక్కని గ్రంథములను వ్రాసి దాని నభివృద్ధికిదెచ్చిన గ్రంథకర్త లిప్పటి కెందరోగలరు. అయినను మన వచనరచన యింకను పలుతెరగుల నభివృద్ధి చెందవలసియున్నదనియు, అందు అనేకములగు పుస్తకములు వ్రాయబడవలసియున్నవనియు గూడ మన భాషాభిమానులందరు దలంచుచునేయున్నారు.

ఆంధ్రభాషాపాండిత్యమున కొక్కింత అలవాటుపడినవా రెంతటి కఠినశైలియందయినను, పద్యరూపమునుండు దుర్గ్రాహ్యములగు వ్రాతలనుసయితము, అందు వర్ణింపబడు విషయము లివియని ముందుగ నెరిగియుండుటచే, అతి శీఘ్రముగ గ్రహింపగలిగి "సులభశైలి నలరారుచున్న"వని తలచుటయు, ప్రతివానికిని తెలియవలసియు, ఇంకను అనేకులు

గ్రహింపక పోవుటచే క్రొత్తవిగనుండు విషయములను, ఎంత వాడుక మాటలతో, ఉదహారణపూర్వకముగ బోధించిననుగూడ "పాక మతికఠినముగ నున్న"దని భ్రమించుచుండుటము నిప్పటి కాచార మైయున్నది.

వ్రాయబడు విషయములనుబట్టియు, వ్రాయు పద్ధతిని బట్టియు, శైలియందలి మార్దవమును, కాఠిన్యమును ఏర్పడునని అందరకును తెలియును. వ్రాయదలపెట్టిన యొక్కొక్క విషయమును గురించియు, అన్ని సంగతులను క్లుప్తముగను సులభముగను పాఠకులకు బోధింపవలెననియే కాని, భాషానైపుణి నగుపరుపవలెనని మాకేమాత్రమును అభిప్రాయము లేదు. ఇక నీశైలియందలి మార్దవముగాని, కాఠిన్యముగాని, ఎంతవరకు విషయమునుబట్టి యేర్పడినది, ఎంతవరకు వ్రాసెడు పద్ధతివలన గలిగినదని నిర్ణయించుట విద్యార్థులకే విడిచిపెట్టవలసి యున్నది.

ఏకారణముననో తాము విడిచిపెట్టకున్నను, కొందరు పండితులు అర్ధానుస్వారములను, శకటరేఫములను ఉపయోగింపకున్నను భాష కేమాత్రమును నష్టము రాదని యనుటవలనను, మాట్లాడుటయం దిప్పుడవి ఉచ్చరింపబడకుండుటచేతను, కొన్ని సమయములలో నర్ధానుస్వారము నుపయోగింపకున్నట్లో, అట్లే మరికొన్ని సమయములలో దానినుపయోగించినయెడలను సందర్భమునుబట్టియే అర్థముజెప్పుకొనవలసివచ్చుటబట్టియు, నారెంటిని మేము విడిచిపెట్ట సాహసించినందుకు భాషాభిమానులు మమ్ము క్షమింతురుగాక. వ్రాఫు

లు దిద్దుటకు వ్యవధి చాలకుండుటచే మావ్యాసములయం ద నేకములుగనున్న అచ్చుతప్పుల నవసరముకలిగిన రెండవకూర్పున సవరింతుము. విషయము ననుసరించియు, చదువరులకు తెలియునట్లును వ్రాయవలయునందుము ; కాని వెనుకముందులాలోచింపక తోచినవిధమున వ్రాయవలెననువారితో మేమేకీభవించుట లేదు.

మొదటనుండియు మాకనేకవిధముల సాయముచేయుచున్న శ్రీ జయంతి సత్యనారాయణమూర్తి, యం.ఏ.; కాళ్ళకూరి సూర్యనారాయణ బి.యె, యల్.టి., గార్లును, మాసంఘోద్దేశముల తెలిసికొని మాకు కొంతసహాయము చేయుటయేగాక, మా ఆదాయవ్యయములను పరీక్షింప నంగీకరించిన రెవరెండ్ జె. రాయ్. స్ట్రాక్, యం.ఏ., బి.డి., గారును మాకుచితరీతిని సాయముచేయనెంచిన మ. రా. రా. శ్రీ వంకిపురం కృష్ణమాచార్యులు, బి.యె., యల్.టి., గారును మాకు వంద్యులు. చందాలమూలమున కావలసిన ధనమునందు విశేషాంశమునొసగి మాప్రయత్నముల నింతవరకును నిర్విఘ్నముగ కొనసాగించిన ఇచటి మిషన్ కాలేజి విద్యార్థులకును, తక్కిన మాస్నేహితులకునుగూడ మేమెంతయు కృతజ్ఞులము.

కీర్తిశేషులైన గోపాలకృష్ణగోఖలెగారి ఛాయాపటము నీసంపుటమున జేర్పదలచియు, తగు ద్రవ్యములేమి నిపుడది మాకెట్లు లభ్యమగునని విచారింపుచుంటిమి. ఇట్టి సమయముట నడిగినమాత్రమున దయతో మాకామహాత్ముని ఛాయాపనఫలకము నొసగి మాపుస్తకమున కాయువుబోసిన కృష్ణాప

త్రికాధిపతిగారగు శ్రీయుత ముట్నూరి కృష్ణారావుగారికి మా కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నారము.

మే మిదివరకు ప్రకటించిన కరపత్రముల కొన్ని పఠన మందిరములకును పుస్తకభాండాగారములకును ఉచితముగ బంపుచుంటిమి. కావలసినధనము ఎల్లప్పుడును చందాలవలననే సంపాదింపగలుగుట కష్టసాధ్యము. కావుననిక మీదటనీకరపత్రములనుక్రమముగ దెప్పించుకొన నెంచినవారు తపాలవ్యయము నకగునారణాలతోగూడ సంవత్సరమునకు పండ్రెండణాలనిచ్చి చందాదార్లుగ జేరి మాయుద్యమమును నెరవేర్పవలెనని వేడుచున్నాము. ధనికులును విద్యాభిమానులు నగువారు మాకు తగు ప్రోత్సాహము నొసగెదరు గాక.

గుంటూరు,<br>5వ మే, 1915.

ఇట్లు విన్నవించు<br>జ్ఞానప్రసాదినీప్రచురణసంఘసభ్యులు.

"ఉద్ధరించెద దేశమే నొక్కరుడనె । నిశ్చయంబిది, సేయంగ నేర డొరుడు";
అనుచు "విలియముపిట్టను నతఁడావలికె। అట్లెయెల్లరు దలపగనగును శుభము";

# జనసామాన్యముయొక్క విద్య.

ఉ॥ విద్య నిగూఢగుప్తమగు విత్తము రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్య గురుండు విదేశబంధుడున్
విద్య విశిష్టదైవతము విద్యకు సాటిధనంబు లేదిలన్
విద్య నృపాలపూజితము విద్య నెరుంగనివాడు మర్త్యుడే॥ భర్తృహరి॥

దేశాభివృద్ధి ముఖ్యముగ జనసామాన్యము యొక్క విద్యాభివృద్ధిపై నాధారపడియుండును. పూర్వకాలమునందు ఇంగ్లాండు, అమెరికా మొదలగు దేశములు అభివృద్ధి యన నేమియో యెరుగని కాలముననే మనదేశ మభ్యున్నతి నంది యుండెను. అందులకు మనదేశమునందలి అప్పటి జనసామాన్యముయొక్క విద్యాభివృద్ధియే ముఖ్యకారణమని చెప్పుటకు దృష్టాంతము లనేకములు కలవు. కాని, పాశ్చాత్యదేశీయులు విద్యావంతు లగుకొలదిని మనవా రజాగ్రతచే విద్యావిహీనులై తమ పూర్వవైభవము నంతయు బోగొట్టుకొనుటచే క్రమముగ ప్రస్తుతపు దైన్యస్థితికి వచ్చుట తటస్థించినది.

ఒకదేశ మభ్యున్నతినందినదనగా అందలిజనులు విద్యావంతులును, బలవంతులునై సర్వవిధముల నారితేరినారని భావము. మరియును దేహబలమునకంటె విద్యాబల మెన్నియోమడంగు లతిశయమని యందరెరిగినయంశమే. కావున,

ఏదైన నొకదేశ మభివృద్ధిలోనికి వచ్చుటకు అందలిజనుల మనోబలాభివృద్ధియే ముఖ్యకారణమనియును అటుపైని వారి మనోబలక్షీణతయే వారి నంతకంతకు గడుదైన్యస్థితికి తేజాలు ననియును జెప్పగలము. ఇప్పుడు నవీనముగ పశ్చిమఖండవాసులచే గనిపెట్టబడిన వాయువిమానములు, విద్యుద్దీపములు మొదలయినవి సాధారణముగా మన ప్రాచీనగ్రంథముల జేర్కొనబడియుండుటచే అప్పటి హిందువుల కీవిషయము లన్నియు తెలిసినవేయనియు, అందుచే వారు శాస్త్రముల నెంతయు నాకాలమున అభివృద్ధినందించిరనియు తెలియుచున్నది. గ్రంథములలో వ్రాయబడిన యద్భుతవర్ణనలును, ఇప్పటికిని మన దేశమునం దచ్చటచ్చట గనబడుచు కనులకు మిరుమిట్లుకొలుపు చిత్రవిచిత్రములయిన శిల్పకళాచాతుర్యములును, అప్పటి వారి శిల్పకళాదక్షతను వేనోళ్ళ జాటుచున్నవి. హృదయరంజకములగు కల్పనలను, వర్ణనలనుగలిగి తమకు దీటగుపొత్తముల గనజాలమి తమ సృష్టికర్తలగు నప్పటిహిందువుల భాషాజ్ఞానమును వెల్లడిజేయు గ్రంథరాజములు సయితమెన్నియో మనదేశమందిప్పుడును గలవు. పూర్వహిందూదేశమున నెన్నియో విద్య లభివృద్ధి నొందినవనియు, ఆయావిద్యలకు సంబంధించిన గ్రంథాలయము లనేకములుండి, పిమ్మట మహమ్మదీయ దండయాత్రా లములో నామ్లేచ్ఛప్రభువులచే తగులపెట్టబడి, చిరకాలము తమ్మతిజాగరూకతతో పెంచినభారతవర్షమున కెడ తెగని సంతాపమునకు కారణములగుటయేగాక, నాని నాశనానంతరమే యీదేశ మిట్టి దుస్థితికి రా మొదలిడెననియు చరిత్రకారులుసయితము వ్రాసియున్నారు. దీనివలన, పుస్తక

భాండాగారములే సర్వవిద్యలకు ఆధారములనియు, అట్టి గ్రంథాలయములు నశించుటచేతనే యీదేశమున పూర్వపువిద్యలన్నియు అంతమొంది, అందుమూలమున మనోబలము తగ్గి, మన భరతఖండమునకు వెనుకటివైభవముపోయి కాలక్రమమున నీస్థితి ప్రాప్తించెననియు మన మూహించుకొనవలసియున్నది. కావున, మన మాతృభూమికి మరల నెన్నడైన నట్టియౌన్నత్యము రావలయునని కోరెదమేని తిరుగ మన దేశీయులలో క్రమక్రమముగా మనోబలాభివృద్ధిజేయ బ్రయత్నించవలయును.

దేశీయులందు మనోబల మభివృద్ధికావలయుననగా వారు నానాటికి విద్యావంతులును, జ్ఞానవంతులునై, బుద్ధికుశలులగుచుండవలయుననియే. ఇంక మనదేశీయులను విద్యాజ్ఞానసంపన్నులుగ జేయనెంచిన మనము చేయవలసిన ప్రయత్నము లెవ్వియో విచారించవలసియున్నది. మన మింతకుబూర్వము వెనుకటి పుస్తకభాండాగార నిర్మూలనమే మన దేశీయుల నిటుల విద్యావిహీనులుగను, శాస్త్రజ్ఞానశూన్యులుగను జేయజాలినదని చెప్పియుంటిమి. కావున, మరల నిప్పుడట్టి పుస్తకాలయముల నెలకొల్పి వృద్ధినొందించుటయే మన యుద్యమమునకు సాధనోపాయమని వేరుగ జెప్పనవసరము లేదు.

మన మాతృభూమియగు నీ ఆర్యావర్తమిప్పుడు వాణిజ్యవ్యాపారాదులలో కీర్తిగన్న పాశ్చాత్యదేశము లన్నిటివలెగాక పట్టణములకంటెను పల్లెటూళ్ళనే యెక్కువగ కలిగియున్నది. కాన నిట్టిదేశమున విద్యాభివృద్ధి జేయనెంచినయెడ

ల, పట్టణములనుమాత్రమేకాక ముఖ్యముగా పల్లెటూళ్ళనే బాగుపరచవలసియున్నది. పట్టణములలో సాధారణముగ విద్యావంతులయిన ఉద్యోగస్థులును, ధనికులు నుండుటచే అట్టివారు తమబిడ్డలను ఆయాపట్టణములలో స్థాపింపబడియుండు పాఠశాలలకంపి చదివించుటకే కాక తమపట్టణముల నెన్నియేని పుస్తకభాండాగారము లేర్పరచుటకును సమర్థులైయుందురు. అట్లగుటజేసి దేశాభిమానులు పల్లెటూళ్ళను లక్షింపక ప్రత్యేకముగ పట్టణవాసులనే విద్యావంతులుగజేయ ప్రయత్నించుట బహుసులభసాధ్యమేయయినను అంత ప్రయోజనకారి కానేరదు. కాని రెండవదియగు పల్లెటూళ్ళ విద్యాభివృద్ధి మిక్కిలి కష్టసాధ్యమును, తగు లాభకారియునై యున్నది. అది నెరవేర్చుటకు విద్యాధికులును, దేశాభిమానులు నగువారు స్వార్థపరత్వమును విడచి, తమ యావచ్ఛక్తిని వినియోగించి, కష్టములకోర్చి, కడుయోపికతో పనిచేయవలసియున్నది.

అట్లు పనిచేయుటకు తగినవారు మొట్టమొదట ప్రతియూర నొకపాఠశాల నేర్పరచవలయును. పిమ్మట తమబిడ్డలననుదినమును పాఠశాలకు శ్రద్ధతో పంపుచుండుటకై మొదట తలిదండ్రులకు విద్యవలని లాభములను, అది లేకపోయిన కలిగెడు నష్టములును వ్రాసగ్రుచ్చినట్లు బోధించి, వారికి ద్రవ్యవిషయమున తగినంతసహాయము జేయుచుండవలయును. కొంచెము వ్రాయను చదువను నేర్చినవారికి వారివారిభాషల లోగల శాస్త్రములను, నవలలను, కావ్యములను బాగుగ నే

ర్పి, అందు వారి కప్పుడప్పుడు కొన్ని పరీక్షలు జరుగునట్లేర్ప రచి వానిలో కృతార్థులయిన వారికి బహుమానములిచ్చి ప్రోత్సాహము కలిగించవలెను. కుటుంబపోషణార్థై పగలంతయు పాటుపడవలసి పాఠశాలకు రాజాలనివారలకు, రాత్రిపాఠశాలల నేర్పరచి అందు వారికి విద్య గరపుచుండవలయును. తీరుబడియుండియు పాఠశాలయనిన భయపడువారికి తగు సదుపాయములతో చదువనిన నొకవిధమయిన రుచిగలుగునట్లు సేయవలెను.

ఇంతియకాక చదువనేర్చిన ప్రతివాడును దాను చదువనెంచిన పుస్తకముల నన్నిటిని కొనుట యసాధ్యమే కాక వృథావ్యయముగూడ నగును. కాన ప్రతి యూరియందును ముఖ్యముగ ఆయూరివారి ఉపయోగార్థమై కావలసిన పుస్తకములు గలిగిన యొక పుస్తకాలయముండిన మిక్కిలి లాభకారిగనుండును. స్వదేశ విదేశసమాచారములను మాత్రమే కాక ఇంక నెన్నియో దేశోపయోగములగు వ్యాసముల గలిగియుండు వార్తాపత్రికలును, జదువనేర్చినవారికెల్ల దొరకుచుండవలయును. అందులకై దేశాభిమానులగు విద్యాధికులొక్కొక్క పల్లెటూరిజనులను విద్యావంతులుగ జేసి వారలకై యొక పుస్తకభాండాగారము మాత్రమే కాక కొన్ని వార్తాపత్రికలును లభింపజేసి వారవి కడుశ్రద్ధతో చదువుచుండునట్లు ప్రోత్సాహపరచుచుండవలయును. పిమ్మట వారందరును తీరికకలిగినపుడెల్ల నొకచోగూడి వారలలో కొందరేదేని యొకవిషయమునుగురించి మాట్లాడునట్లును, కడమవారావిష

యముపై తమకుగల యభిప్రాయము లిచ్చునట్లును ఏర్పాటు జేయవలయును. ఈవిధమున విద్యాధికులగు దేశాభిమానులు విద్యావిహీనులగు సోదరులకై పాటుపడనెంచిన, కొలదికాలముననే పల్లెటూళ్లలో విద్య అభివృద్ధియై వారందరును జ్ఞానవంతులగుదురు. పల్లెటూళ్ల జనులందరును విద్యావంతులయ్యెదరేని మన హిందూదేశము తన యిప్పటి దురవస్థనువీడి మరల నెప్పటి యౌన్నత్యము నందగలదని సూఢిగ జెప్పగలము.

ఈపనియంతయు సులభసాధ్యమనుకొనగూడదు. ఏలయన చిరకాలమునుండి పెరుగనిచ్చిన ఒకానొక వ్యాధిని మాన్పుట కెట్లధిక శ్రమ పడవలసివచ్చునో, అట్లే పూర్వమెన్నడో మన దేశమును బ్రవేసించి అప్పటినుండియు యధేచ్ఛముగ పెరిగిన యీ అజ్ఞానరోగమును బాపుటకుకూడ మిక్కిలి ప్రయాసపడవలసి వచ్చును. మొదట నాతని మేలుగోరి యీయబోయిన ఔషధమును సేవింపనొల్లని రోగివలెనే, అజ్ఞానజాడ్యపీడితులగు మన పల్లెటూరి సోదరులును తమకై చేయబడిన సహాయము నెల్లకుండుటయేగాక, విద్యాధికులలో నయితము కొందరనుకొనునట్లు విద్య ముఖ్యముగా ధనార్జనమునకె ననుకొని "విద్య నేర్చినవారి కెల్ల నుద్యోగములగునా" మొదలగు పిచ్చి ప్రశ్నల నడిగి, తమకై పాటుపడువారిని నిరుత్సాహపరతురు. అయినప్పటికిని, పట్టుదలతో పనిచేయువారిట్టి యాటంకముల లెక్క చేయరు. కాని యింతకంటెను ఎక్కువయిన యాటంక మింకొకటికలదు. అయ్యది ధనలోపమే. మన దేశమునందలి ధనవంతులలో ననేకులు తమ ప్రాణ

మునకును డబ్బునకును లంకెవేసి, వివేకహీనులై, స్వార్థ-ప
రత్వమును విడువలేక ఇట్టిదేశోపయోగకరములగుపనులకు స
యితము సహాయముచేయ నిచ్ఛగింపకున్నారు. అంతతోపో
యినను కొంత అనుకూలమేకాని, తమరు సహాయము చేయ
కపోవుటయటుండ, చేయనెంచువారిని సయితము నిరుత్సా
హులగావింతురు. పశువునకును మనుజునకునుగలభేదము స్వా
ర్థపరత్వమును విడుచుటతో ప్రారంభమగును. అందుచే వి
ద్యాధికులైనవారెల్లరు, విద్యవలన కలిగెడు లాభములనుమా
త్రము పొంది యూరకుండక, దానితోవచ్చెడు భారములను
సయితము భరించవలెను. కావున విద్యాధికులైన వారెల్లరు
తమతమ గ్రామములలోని జనులను విద్యావంతులనుజేసి, ఆ
మూలముననైన మాతృదేశ ఋణవిముక్తులగుట శ్రేయోదా
యకము. ప్రస్తుతపు ఇంగ్లీషువిద్యార్థులలో ననేకులు పల్లె
టూళ్ళకు సంబంధించిన వారగుటచేసి వారలలో ప్రతివారు
ను తమతమ గ్రామస్థులకే విషయముల బోధించి, వారికి ద
గు సాయమొనర్చవలెను. సభలయందతికుతూహలము గన
పరచి, అంతటితో నూరకుండు అనేకమంది పెద్దలవలెగాక,
మనస్ఫూర్తిగను, మిక్కిలి పట్టుదలతోడను పనిచేసిన యీ
యుద్యమమున కృతార్థులగు టెంతయు సులభము.

దేవాలయములేని గ్రామమే యుండకూడదని యెంచి,
వేలకొలదిగ ధనవ్యయముచేసి, గుడిగోపురములు కట్టించి, అం
దు విగ్రహప్రతిష్ఠయు, నాటినుండి నిత్యనైవేద్యములును,
ప్రతివత్సరము కళ్యాణోత్సవములును జరుపగల మహానుభా
వులకు ఒకపాఠశాలయు, దానికి కావలసిన ఒక పుస్తకాల

యమును నేర్పరచి తమ గ్రామములోనివారలకు విద్యగరపించుట కష్టసాధ్యము కాదు. అంతియకాక, దేవాలయములేని ఊరే యుండగూడదనిచో మూఢులును, విద్యావిహీనులునగు మానవులతోనిండిన గ్రామము లుండవచ్చునని యెవ్వరయిన ననగలరా? దేవాలయములకనిన వచ్చెడు ధనము, శ్రద్ధతో పాటుపడిన పాఠశాలలను, పుస్తకభాండాగారములను స్థాపించుటకుమాత్రము చాలకపోవునా? దీనికంతకును మనలో పెక్కుమందికి విద్యవలని లాభములు తెలియకపోవుటయే ముఖ్యకారణము. కావున ప్రతియూర నొకపాఠశాలయు, ఒక పుస్తకభాండాగారమును నెలకొలిపి వానిని పోషింపుచుంటిమేని అత్యల్పకాలముననే దేశ మభ్యున్నతినంది మరల వెనుకటిస్థితికి రాగలదు. అప్పుడీ దేశీయులును విద్యావంతులై కృషివాణిజ్యవ్యాపారాదుల అన్యదేశీయుల కేమాత్రమును తీసిపోవక, స్వగౌరవమును నిల్పుకొనజాలుదురు. అట్టిదినమే భారతదేశ నూతనవికాసమున కారంభము. అట్టి సంతోషదివసమునకై అత్యుత్సాహముతో నెదురుచూచుచు, మనమందరమును మన దేశీయుల విద్యాభివృద్ధికై సర్వవిధముల పాటుపడి కృతకృత్యుల మయ్యెదము గాక!

---



---

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె. 1915.

“ఉద్ధరించెద దేశమే నొక్కరుడనై। నిశ్చయంబిది, సేయంగ నేరడొరుడు”;
అనుచు “విలియముపిట్టను నతండు పలికె। ఆట్లెయెల్లరు దలపగనగును శుభము.

# అంత్యజులు.

చ. దయయును, సత్యముఁ, శమము ◆ ధర్మగుణంబును, బేద వారలన్
నయమున జేరదీసి తగు◆నట్టివిధంబున వారికిన్ సుని
తియును, నమూల్యభాషణ, మ◆తిప్రతిభాకరమై వెలుంగు వి
ద్దియ నెనగూర్చు బుద్ధియును ◆ దెల్పెడి సజ్జను నెవ్వడున్ భువిన్.

అంత్యజులనగా మాల, మాదిగ, యెరుక, యేనాది, కోయ, చెంచు మొదలగు తక్కువజాతివారని యభిప్రాయము. వీరిలో మొదటి రెండుతెగలవారిని గడజాతివారనుటయు గలదు. ఈ రెండుకులములవారును హిందూదేశమున కార్యులు రాకపూర్వ మిచట నివసించుచుండిన యాదిమజాతులకు జెందినవారనియు దరువాత గొన్ని కారణములచే నార్యులలోనుండి బహిష్కరింపబడినవా రనేకులు వారిలో జేరగా నాకులము లంతకంతకు వృద్ధిజెందినవనియు గొందర భిప్రాయపడుచున్నారు. తక్కినయెరుక, యేనాది మొదలగుజాతులవారిలో మరల రెండుతరగతులుగలవు. అందు మొదటి తరగతివారు సామాన్యజనులవలె యిండ్లువాకిళ్లుగలిగి, యేదియో నొకప్రదేశమును నివాసస్థానముగ నేర్పరచుకొని, వ్యవసాయాది సద్వృత్తులచే జీవింపక, నడవులలో దిరుగాడుచు, మాంసమును, దుం

పలనుదిని కాలముగడపు నాటవికులుగను, రెండవతరగతివా రు తమగృహమును గృహోపకరణములను సయితమొక గాడిదపైనే దరలించుకొని దినమున కొకయూరుగ బ్రయాణముసేయుచు గాయకష్టమన నేమియో యెరుంగక జోరవృత్తి చేతనే పొట్టబోసికొను మూర్ఖులుగనున్నారు. ఇట్టి వీరందరును గలసి ప్రస్తుతము మనదేశపు జనసంఖ్యలో సుమారైదవభాగముందురని జనాభావలన దెలియుచున్నది.

ఇట్లు పైజెప్పబడిన వివిధజాతులవారిలో మాలమాదిగలును గొంద రెరుకయేనాదులును మాత్ర మిప్పుడొకనియమిత ప్రదేశము నిల్లువాకిలిగలిగి నివసించుటకలదు. అంత్యజుల యభివృద్ధికై పాటుబడనెంచు ప్రతిపైందవుడును ముందు వీరల విషయమైయే యాలోచింపవలెను. ఇంటగెలిచినగదా రచ్చ గెలుచుట. ఎరుక యేనాదుల నగ్రవర్ణములవారిండ్లలోనికి గాకున్నను శూద్రులనువలె దమయావరణములలోనికైన రానిచ్చెదరు. కాని మాలమాదిగలకుమాత్రము పదిపదునైదుగజముల దూరముననే తొలగిపోవుటయేగాక నిష్కారణముగ వారిని జెప్పరానివారనియు జండాలురనియు బేర్లుపెట్టి పిలిచెదరు. చేతితో తాకుటకుమాత్రమేగాక, మీదుమిక్కిలి సమీపముగ బోవుటకయినను గోరగాని యీహీనకులజులకు విద్య లభించుటయెట్లు? సత్సాంగత్యముటుండ సజ్జనపరిచయము సయితము లేన్ని ప్రాపంచములకును నెరుకుయేనాదులకును సద్వృత్తులయం దభిలాషయు, నసత్యమునందు ద్వేషభావమును జనించు విధమెయ్యది? కావున వారిలో సామాన్యముగ నూటికేబదిమంది దొంగతనమునే జీవనాధారముగా జేసికొనెద

రు. తక్కినవారు మాలమాదిగలుగనుండిన, కూలినాలిచేసి కృషికునకు సాయమొనర్చియు, మరణించినజంతువుల కళేబరములుకుళ్ళిగ్రామములలో దుర్గంధములను, నంటుజాడ్యములను గలిగింపకుండ దూరమునకు గొనిపోయియు, వాని చర్మముల నూని బాగుచేసి చెప్పులను, వ్యవసాయసామగ్రిని జేసియిచ్చియు మనకు మేలొనగూర్చుచుండెదరు. వీరిలో మాలలు వస్త్రములు నేయుటచే జనుల మానరక్షణమును సయితమొనరింతురు. అట్టివారెరుకలయేనామలయినచో రాత్రులలో గ్రామములయం దిండ్లుచుట్టును, బొలములయందు బైరుపంటలకును గావలి కాయుచుందురు.

ఇట్లు తమ కనేకవిధముల సాహాయ్యమొనరించుచున్న ఈయంత్యజుల నగ్రజాతులవారెట్లుచూచుచున్నారో యాలోచింపుడు. చతుష్పాత్తులయి, యాకలములదిను పశువులను, మేకలను, మాంసాదులమెసంగుకుక్కలను, బిల్లులను రెక్కలసహాయముచే నాకసమున సంచరించు చిలుకలు గోరువంకలు మొదలగుపక్షులను, నేలబ్రాకులాడుచు జూచుటకుసయిత మింపుగానుండని యనేకములగు పురుగులనుగూడ దమచేతులతోడనే ముట్టుకొనియెదరుకాని తమవలెనే రెండుకాళ్ళను రెండుచేతులనుగలిగి, తమవలె నన్నమును దమలో గొందరివలె మాంసమునుదిని, వస్త్రములన్ధరించి, తమవలె నాకలి, నిద్ర, భయము, ప్రేమ మొదలగు మానవస్వభావజన్యములగు గుణముల నన్నిటినిగలిగి, యెందును తమకు దీసిపోవక పైజెప్పినట్లు తమకెన్నియోవిధముల దోడ్పడునట్టియు, నిరపాయకారులగునట్టియు, సాటిమానవుల దమచేతులతో దాకు

టకును, తమనోటితో బిలుచుటకునుగూడ వెరగందుచున్నారు. ఆహా! అజ్ఞానము! అన్యాయము! కాదు క్రౌర్యము. ఇంతకంటెను మానవులేకాలమునందైన గృతఘ్నులుగను దుర్మార్గులుగను నుండగలరా? కలియుగమాహాత్మ్యమనబడు నన్యాయమంతయు నీకాలమునం దగ్రజుల మనుకొనువా రంత్యజులయెడ గనబరచు దుర్మార్గరూపమున నీ హిందూదేశ దర్పణమున బ్రతిఫలించుచున్నది.

ఈనీచజాతులవా రజ్ఞానులగుట, వారికి జదువుసంధ్యలు రాకపోవుట వా రనారోగ్యకరులుగను, నసహ్యకరముగను నుండుట, వారిలో గొందరు చోరవృత్తినిమెలగుటచే నమ్మదగనివారగుట మొదలగుసంగతులన్నియు వాస్తవమేయగును కాని యట్టిలోపముల కన్నిటికిని గారణము విద్యావంతులును న్యాయశీలురును, శుచిగలవారును, నగు నగ్రవర్ణములవారు తమవారితోబాటు వారికినివిద్యాబుద్ధులుగరపి వారిని దుష్కార్యములనుండి మరల్చి, సన్మార్గములబెట్టక, గర్వించి వారిని నేవగించుటయే. తప్పొనరించినవారల దండించుట విధాయకము. అట్టి శిక్ష కొంతకాలమువరకుమాత్రముండి యాద్రోహిని సజ్జనునిగమార్చజాలినదయి యుండవలయును. నరహత్యలొనరించినవారికిమాత్రము జీవితాంతమువరకును శిక్ష విధించుట కలదు. కాని యదియు గూడదనియే కొందరి యభిప్రాయము. దండనార్హులగనుండువారియెడలనే యిట్టియభిప్రాయములుండ నిక నేయపకృతియు నొనర్పనివా రజ్ఞానమువలన నశుభ్రముగను నక్రమముగనునుండిరనుమిష చేతనే కొన్ని మాసములును వత్సరములునుగాదుసరిగదా కొన్ని పురుషాంతము

లవరకయిననుగాక ననంతమగు క్రూరదండనవిధించుట యేటి
న్యాయము? తలిదండ్రు లధర్మమున విద్యావంతులై బుద్ధి తెలి
సిన యగ్రజు లందరు నిక దమకంటె బసివారగుటచే నజ్ఞాన
మున బడియున్న తమ యనుంగుదమ్ముల నిట్టులనే చూడవల
యునుగాబోలు! జాలిగుండెగలిగి పరోపకారమే ప్రథమధర్మ
ముగ నెంచు మానవమాత్రు డెవ్వడు నిట్టిది తగునని మన
స్ఫూర్తిగ ననజాలడు.

కావున మన హిందూదేశమునందలి విద్యావంతులును
సజ్జనులును నగు ప్రతిపూరుషుడును నిట్టి దుస్థితిలోనున్న యం
త్యజులును మానవులేయనియు నంతియకాక మన దేశీయసోద
రులేయనియు నెరుంగవలయును. మనము వారియెడలనసూయ
భావమువదలి వారియభివృద్ధికొరకై పాటుపడవలయును. ద
యతో వారిని దగ్గరకుదీసి మంచిమాటలతో వారి మనముల
నాటునట్లుగా విద్య, సత్యము, శౌచము మొదలగుసువిషయ
ములబోధించి వారిని విద్యావంతులుగను, నారోగ్యప్రసులు
గను న్యాయశీలురుగను నొనర్చవలయును. వారిబిడ్డలకు విద్యా
లయములలో నుచితముగ జదువునేర్పుటయేకాక వారికొరకై
రాత్రిపాఠశాలలను, నివేశనగృహములనుస్థాపించి, బీదవారల
కన్నవస్త్రములుగూడనిచ్చి వారియందు విద్యాభివృద్ధిగావింప
వలయును. వారిలో విద్యాధికులయినవారిని మనసంఘములో
జేర్చుకొని గౌరవించవలయును. వారందరును న్యాయమార్గ
మునువీడక సద్వృత్తుల నలవరచుకొని పరస్పరసాహాయ్యమొ
నర్చుకొనుచు గౌరవముగ సుఖజీవనము చేయునట్లొనర్చవల
యును. వారిలో ప్రతివాడును దన కులవృత్తి నభివృద్ధిపరచి,

తన్మూలమున శక్తి కొలదిని మాతృదేశైశ్వర్యాభివృద్ధికి దోడ్పడునట్లుగ చేయవలయును. ఇంతియకాక వారిలోనే మతస్థుల నామతసంబంధమయిన దేవాలయములలోనికి నిరాటంకముగ రానిచ్చుచుండవలయును. ఈవిధముగ వారియభివృద్ధికై పాటుపడుదుమేని యిదివరకు వారియెడల మన మొనరించిన మహాపాతకమునకు బ్రతిక్రియగానుండును.

ఈనీచజాతులవారి నిదివరకెన్నడును మనము తగువిధమున నాదరించియుండలేదు. కావున మిషనరీలనబడు పాశ్చాత్యమతప్రచారకు లీదేశములో దమమతమును బాగుగ వృద్ధి జేయవచ్చునుగదా యని తలచిరి. అగ్రవర్ణములవారు గాకపోయిన నీహీనజాతులవారైన ననేకు లందు జేరుదురుగదా యను ధైర్యము వారికిగలిగెను. అంతట వారికులస్థుల కనువగునట్లు బోధనసాధనముల నేర్పరచి తమశక్తి కొలదిని బాటుపడసాగిరి. అనేకతరములనుండియు నజ్ఞానాంధకారమునబడి పరితపించుచున్న యీబీదజనులు తమకు జ్ఞానప్రకాశ మొసగి మార్గదర్శకులయిన యాదయామయులపైననే దృష్టినిగిడ్చి, యతివినయముతో వారి ననుసరించసాగిరి. ఇది రెండుప్రక్కలవారికి ననుకూలముగనేయుండెను. తమతో సమానులుగ గాకపోయినను మన యగ్రవర్ణములవారికంటె నెక్కువగనైన క్రైస్తవమతబోధకు లీయంత్యజుల నొనరించిరి. పవిత్రోదకస్నానమునుబొంది, ప్రచ్ఛన్న నామధారులై, విద్యాధనగౌరవార్హపదసంశోభితులగు తమ పూర్వచండాలురనే మన యగ్రవర్ణములవా రాశ్రయింపవలసినస్థితివచ్చెను. అంతట నగ్రజు లాలోచింపసాగిరి. వారిలో గొందరీయంత్యజాతులవారిని మనమే

విద్యావంతులుగనొనర్చి సంఘములో జేర్చుకొన్న యెడల మన గౌరవము నిలువగలదనితలచిరి. కాని కొందరి కింకను నిదియే కర్తవ్యమని బోధపడదాయెను. అట్లొనర్పవలదని కొన్ని కారణములను జూపనెంచిరి. కానిరుజువుచేయవీలులేక నవినిరర్థకములైనవి. ప్రస్తుతముమాత్ర మనేకు లీవిషయమునుగురించి సదభిప్రాయము నేకలిగియున్నారు. అయిన నట్టివారిలో దామను కొన్న యట్లాచరించువా రతిస్వల్పసంఖ్యాలుమాత్రము కలరు. వారిమార్గము లవశ్యాచరణీయములు.

మతాభిప్రాయములతో మన కేసంబంధము నుండగూడదు. ఇచ్ఛానుసారముగ నెవరికి మంచిదనితోచిన మతమును వా డవలంబింపవచ్చును. దానివలన దేశాభివృద్ధి కేమాత్రమును నష్టముకలుగ నేరదు. కాని మననీచజాతులలోనివా రనేకులు తమ మతమునందును, ఇతరులమతములయందునుగల మంచి చెడ్డల నాలోచింపజాలరు. మన మతమెద్దియో యందలి ముఖ్యాంశములెవ్విగలవో యని మనబ్రాహ్మణులు వారికెన్నడును బోధించియుండలేదు. అందుచే మనమతముసంగతి యెట్లున్నను మనసంఘమునందలి కష్టములనుభరింపజాలక వా రన్యమతములో చేరుచున్నారు. మతముకొరకై చేరువారును గొందరు లేకపోలేదు. అట్టివారు కొలదిమందిమాత్రమేకలరు. కావున నీపంచమకులజులకు హిందువులన్న సహజవిరోధమేర్పడుచున్నది. తరువాత హిందూదేశస్థులందరు నేమతమువారైన నొక్కకుటుంబములోనివారివలె నుండినగాని దేశమభివృద్ధికిరాదని యీక్రైస్తవులైన పంచములకు దెలియజేయుట చాల కష్టసాధ్యమగుచున్నది. సంఘమునందు బాగుగజూడబడి అన్య

మతము మంచిదను అభిప్రాయముతో దాని నవలంబించువారికి హిందువుపై నెన్నడును ద్వేషము కలుగదు. కావున శీఘ్రకాలములో మనదేశమునందలి నీచజాతులవారి నభివృద్ధికి దెచ్చిననే కాని మనదేశము బాగుపడజాలదు. ఈవిషయము విద్యావంతులగు మనదేశస్థులందరికిని బోధపడినకొలది నేహైందవ కీర్తిలత నలుగడలవ్యాపించి పుష్పఫలసంశోభితమగుచుండును. దీనినెరిగి సమయోచితముగ దేశాభివృద్ధికై పాటుపడుట దేశాభిమానుల విధి.

విశేషములు కోరువారు,

ఏటుకూరు జోగిరాజుగారు,

అరండల్ పేట, గుంటూరు.

అని వ్రాసిన తెలియును.

Printed at the Vani Press, Guntur. 1-4-15

"ఉద్ధరించెద దేశ మేనొక్కరుఁడనె । నిశ్చయంబిది. సేయఁగ నేరఁడొరుఁడు";
అనుచు "విలియముపిట్టను నతఁడువలికె । అట్టియుల్లరు దలపగనగును శుభము.

# కలరా.

ఇదిఒకజాడ్యము—

కలరాఅనునది ఒకజాడ్యముగాని ఏఅమ్మవారియొక్క ప్రభావమునుగాదు. ఇది ఒకవిధమైన సూక్ష్మజీవులవలన గలుగును. ఈచిన్నపురుగులు సుమారు మూడువందలుకలిసిన ఒక చిన్న నల్లచీమయంతఉండును. ఇవి అతిశీఘ్రముగా ప్రబలును. ఆడది మగది అనుభేదములేక ప్రతిపురుగును దినమునకు అనేక లక్షలపిల్లలు పెట్టును. వీనికి ముఖ్యముగా మురుగునీటియందుగల మాలిన్యమే ఆహారము. వేడిదగులుచోటఇవి బ్రతుకజాలవు. అందువలనఇవిసామాన్యముగా మురికినీటియందు కానుపించును.

దీనిముఖ్య లక్షణములు—

రాత్రులయందును తెల్లవారుఝామునను గాలి చల్లగనుండి జనులు బలహీనముగనుంటచే కలరా సామాన్యముగ నప్పుడుకనుపించును. చెమటకై ననోర్చుకొని దేహముల నెప్పుడును కప్పుకొనియుండుట చాలముఖ్యము. పలుచని గంజివలెనుండు అమితమైన విరోచనములు, వాంతులు, కాళ్లుచేతులు ఈడ్చుకొనిపోవుట, మూత్రము బంధించుట, శరీరము చలువలు గ్రమ్ముట, తగిలినవారిలో అనేకులు మృతినొందుట, ఇవి ఈ వ్యాధియొక్క ముఖ్యచిహ్నములు. తరుచుగా వీనిలో అనేక

ములు కనుపించకపోవచ్చును. కాని విరోచనములు గంజివలె
పలుచగానగునెడల ఆవ్యాధికలరా అనిరూఢిగ చెప్పవచ్చును.
ఇది వ్యాపించువిధము.

ఇదిముఖ్యముగ నీటిమూలమునవ్యాపించుచున్నది. అయి
నను మనముపీల్చుగాలివలనగాని, భుజించు పదార్థములవలనగా
ని కలరాపురుగులు ఒక్కొక్కప్పుడు మనకడుపులోనికి ప్రవే
శించవచ్చును. మురికినీటియందేకాని పరిశుభ్రమైననీటిలో ఈక
లరాపురుగులు బ్రతుకజాలవు. ఈగలు, దోమలు మొదలగు
చిన్నచిన్నపురుగులు కలరారోగులు విసర్జించిన మలమూత్ర
ములమీదను, పెంటకుప్పలమీదను, కుళ్ళిన పదార్థములమీ
దను వ్రాలి అచ్చటనుండు కలరాపురుగులను వేలకువేలు తీసి
కొనివచ్చి మన ఆహారపదార్థములమీదను వస్త్రములమీద
ను జేర్చును. ఈవిధమునగూడ కలరాపురుగులు మన జీర్ణకో
శములో ప్రవేశించి రోగమును కలిగించును.

కొన్నివేళల భయమును కలరాకు ఒక కారణమని కొం
దరూహింతురు. అయినను ఎంతభయస్థునకైనను వానిజీర్ణాశ
యములో కలరా సూక్ష్మజీవులు ప్రవేశించనియెడల ఈవ్యాధి
కలుగనేరదనుట నిశ్చయము. కాని కలరాపురుగులు కడుపులో
జేరి వృద్ధిజెందుచున్నప్పుడు భయముకూడ తోడగునేని శరీర
ము బలహీనమగుటచేత వ్యాధి అతిత్వరితముగ వద్ధిచెందును.
ఎట్టివారికేని కలరాగల ఇంటిలోనికి పోయినంతమాత్రమున
రోగముకలుగునను భయము ఎంతమాత్రము ఉండనవసరము

లేదు. అట్లని అజాగ్రతగ నుండక ఈవ్యాధికి దూరముగనుండుటయే మంచిది.

దానిని ఆపుటకుగల సదుపాయములు—

మొట్టమొదట కలరా ప్రబలియుండు ప్రదేశములకు జనులు విశేషముగ పోగూడదు. కలరామైలచే అశుభ్రమైనవని అనుమానముగల నూతి నీటిలో పొటాశియంపర్మాంగనేట్ అను ఒక ఊదారంగుగల లవణమును కలుపవలెను. అట్టినూతిలో నుండి ఒక చేదెడునీళ్ళను ముందుతోడి రెండుమూడుముక్కలు పైజెప్పినమందును అందులో వేయవలెను. అదికొంతవరకు కరిగి ఎర్రగానగును. ఆనీటిని నూతిలో పోసి, కరుగనిమందుతో సహా చేదను లోపలికివిడిచి మరల పైకితీయవలయును. ఈనీరుకూడ ఎర్రగనుండును. దానినికూడ నూతిలోపోసి ఇంకను మందుకరుగనియెడల అది కరుగునంతవరకు పైవిధమున చేయవలెను. ఇట్లు నూతినీరంతయును ఒకమాత్రపు ఎర్రరంగును కలిగియుండునంతవరకు ఈమందును కలుపవలయును. సామాన్యముగ సాయంత్రపుపూట నూతిలో మందునుకలిపి మరునాడు ఉదయమువరకును ఆనూతినీటినివాడకుండవలెను. మురికిగానుండునీటిలో చిల్లగింజగంధముకాని, పటికెపొడుమునుకాని కలిపినచో మురికియును దానియందుండు చిన్నచిన్న పురుగులును అడుగునకుదిగును. అపుడు పైనీటిని తేర్చుకొని త్రాగవచ్చును. వీనిఅన్నిటికంటెను, నీటిని సలసల మరుగువరకునుకాచి, మూతబెట్టి చల్లార్చి త్రాగుట చాలామంచిది. ఇట్టినీటిని త్రాగువారికి సామాన్యముగ ఈవ్యాధి తగులదనియే చెప్పవ

చ్చును. కలరా ప్రబలియుండుదినములలో గంధకము, హారతి కర్పూరము, గుగ్గిలము వీనిలో దేనినైన ఇండ్లలో పొగవేయవలయును. ఆసమయమున ఇంటిలోనివారందరు బయటికివచ్చి ఇంటితలుపులను కిటికీలను మూసి ఇంటియందు అంతటను పొగవ్యాపించునట్లు చేయుట మిక్కిలిఅవసరము. ఇట్లు ఒకటి రెండు గంటలవరకును ఉండనిచ్చి పిమ్మట తలుపులు తెరచి పొగ అంతయు పోయినవెనుక ఇంటిలోనికిపోవలయును. అప్పుడప్పుడు పొటాశియంపరమాంగనేటు కలిపిననీటిని ఇంటియంతటను గోడలమీదను చల్లవలెను. కుళ్ళి చెడిపోయిన కాయగూరలును, అజీర్ణముకలుగజేయు ఆహారపదార్థములును, పాసిపోయిన అన్నమును తినకూడదు. కలరారోజులలో భోజనపదార్థములు వేడిగానున్నప్పుడే భుజించుటమంచిది. కలరా ఉండు దినములలో అజీర్ణమువలన గలిగిన విరేచనములును, నెత్తురు బంక విరోచనములు ఒక్కొక్కప్పుడు కలరాగామారుచుండును గావున, ఏవిధమైన విరేచనములైనను త్వరలో తగుజాగ్రత్తతీసికొనవలెను. విరేచనములధికముగ నున్నయెడల కలరా మందులనే వాడవచ్చును.

దీనికిచికిత్స—

కలరాతగిలినవెనుక గమనింపవలసిన ముఖ్యవిషయములు

౧ విరేచనములనాపుట:—దీనికి ఈక్రింద రెండువిధములగు మందులలో దేనినైన ఉపయోగించవచ్చును. 1 శుద్ధిచేసినఇంగిలీకము 2 నల్లమందు 3 తుంగముస్తలచూర్ణము 4 కొడిశపాలవిత్తులచూర్ణము 5 జాజికాయచూర్ణము 6 హారతికర్పూరము

వీనిని సమభాగములుగతీసుకొని చక్కగా నీళ్ళతో మాత్రలగువరకు మర్దించి పెసరగింజలంత మాత్రలు కట్టి నీడను ఎండించి సీసాలలో జాగ్రతచేయవలెను. విరేచనము లధికముగ ఉండిన ప్రతి రెండేసిగంటలకును రెండుమాత్రలవంతున విరేచనములు కట్టువరకు ఇచ్చుచుండవలెను.

రెండవమందు—1 తుంగము స్తలచూర్ణము 2 కొడిశపాలవిత్తులచూర్ణము 3 మిరియాలచూర్ణము 4 హారతికర్పూరము 5 నల్లమందు 6 ఎండుమిరపకాయలచూర్ణము వీనిని సమభాగములుగ తీసుకొని చక్కగ నీళ్ళతో మాత్రలగువరకు మర్దించి కందిగింజలంత మాత్రలు చేయవలెను. పైమాత్రల వలెనే వీనినికూడ ఉపయోగించవచ్చును.

ఒకతులము ఎండుమిరపకాయగింజలను మూకుడులో దోరమాడ్చి అందులో పావుశేరునీళ్ళుపోసి, గింజలను బాగుగ కలిపి వడగట్టిన కషాయమును విరేచనములు ఆరంభముకాగానేగంటకు గుక్కెడుచొప్పున త్రాగనిచ్చిన చాలమంచిది. ఈకషాయముతో పైజెప్పిన మాత్రలు సయితము కలిపి యియ్యవచ్చును.

౨ వాంతికట్టించుట:—వాంతిని నిలుపుటకు మంచుగడ్డ నములుట మంచిది. అది దొరకనిచో ఆవపిండిని బొడ్డుయొద్దనుండి ఎదురురొమ్మువరకును పట్టువేయుట ఉచితము జీలకర్ర కషాయమును ఈయవచ్చును. ఏలకులను పొట్టుతో కషాయముచేసి త్రాగించవచ్చును. పమిడిపత్తికాయ తేనెతోకాని నిమ్మకాయరసముతోకాని చాది నాలుకమీద కొంచెము కొంచె

ము రాయుచుండుటమంచిది. మాడ్చినబియ్యపునూకలనుగాని, వరిపేలాలపిండినిగాని నీళ్ళలోకలిపి వడకట్టి వాంతులుఆగువరకు ఇయ్యవచ్చును. ఏదిగాని మిక్కుటముగాఇచ్చిన వాంతులు అధికమగును కొంచముకొంచముగా ఇచ్చుట మంచిది.

3 శరీరముయొక్క వేడిమిని తగ్గిపోకుండ కాపాడుట:—వేడిని పుట్టించుటకై కస్తూరిని అరగురిగింజయెత్తు మొదలు ఒకగురిగింజవరకును వ్యాధి బలమునను సరించి, అరగంటకొకమారు రెండు ఉద్ధరిణల చనుబాలు, బ్రాంది, సారాయి వీనిలో దేనితోనైనను కలిపి యిచ్చుచుండవలెను. వెలిబూడిదె, ఆవపిండి, పసుపు వీనిని ఒక్కొకదానినిగాని కొన్నిటిచేర్చిగాని అందు హారతికర్పూరపు పొడినికలిపి శరీరమునకు రుద్దవలెను వెల్లుల్లిపాయలను వలిచి మెత్తగానూరి కాళ్ళకు, చేతులకు పూయవచ్చును. ములగచెక్క, పసుపు, పొడిగాగొట్టి వంటికిరుద్దుట మంచిది. రోగికి కంబళికప్పి వేడినీళ్ళతోను వెచ్చని యిటుక పొడుముతోను కాచుట మంచిది.

4 నీరసించిన నాడినిబలపరచుట:—పైపేరాలో చెప్పినట్లు కాచుటవలన దేహము చలువతగ్గుటయేకాక నాడికికూడ బలముకలుగును లేనిచో తడవకు ఒకటిన్నరతులముల చొప్పున బ్రాందిని గంటగంటకు ఇచ్చుచుండుట మిక్కిలి శ్రేష్ఠము.

5 కాళ్లుచేతులయందుగల తిమ్మిరిని తీపును అణచుట:—కాళ్లుచేతుల తీపులునివారించుటకు కర్పూరతైలము మొదలగువేడిబుట్టించుమందులను మర్దనచేయవచ్చును. కాళ్లుపిసుకుట, తీపు పుట్టినచోట గుడ్డపేలికలు చుట్టుట కొంతపనిచేయును. గుడ్డపే

లికలుకట్టినచో అప్పుడప్పుడవి విప్పి మరల కట్టుచుండవలెను.
౬. హరించిపోయిన మూత్రమును తిరిగి స్రవింపజేయుట:—మూత్రము ధారాళముగ స్రవించుటకై రేవల్ చిన్ని, సూరేకారము నీళ్ళతోచాది బొడ్డుచుట్టును పట్టువేయవలెను. ఈపట్టును గంటగంటకుదీసి మరలవేయుచుండవలెను. సూరేకారమును, తెల్లగలిజేరును, కొంచెమునీళ్ళలో పొంగువచ్చునట్లు కాచి ఆనీటిలో కంబళిగుడ్డతడిపి పిండి ఆవిరిగలబట్టను పొత్తికడుపుమీద కాచవలెను. మూత్రముబంధించిన సమయములో నల్లమందు కలిపిన మందులను యెంతమాత్రమును ఈయరాదు.

౭ పథ్యము:— కలరాతగిలినవానికి ఆహారమేమియు కడుపులో ఇముడదు ఇమిడినను జీర్ణముకాదు. కాబట్టి వ్యాధితీవ్రము తగ్గువరకును మసలి చల్లారిన నీటినిగాని, జీలకర్రకషాయమునుగాని ఇచ్చుచుండవలయును. వ్యాధికొంచము తగ్గుటతోనే నూకలజావ, గోధుమజావ, సగ్గుబియ్యపుజావ మొదలగు వానిని చారుతోగాని పాలతోగాని కలిపి రెండుమూడుదినములవరకుఇచ్చుచుండవలెను ఈజావపలుచగనుండుటయే మంచిది

కలరామైల ఇంటిలో కలియకుండుటకై యీక్రింది యేర్పాటుల చేయవలయును

1 రోగిని ప్రత్యేకమైన గదిలోనుంచి, దానిలో నిమిత్తము లేనిసామానుల తీసివేయవలెను.

2 ఒకదుప్పటిని కార్బాలిక్ మందు నీళ్ళలోతడిపి గదివాకిలికి అడ్డముగా కట్టవలెను.

3 ఆగదియొక్క కిటికీలన్నియు తెలిచియుంచవలెను.

4 రోగికి ఉపచారము చేయువారు ప్రత్యేకముగానుండి వారు భోజనము చేయుటకు పూర్వము తమచేతులను ముందు సబ్బు, శీకాయ, కుంకుడుకాయ మొదలగువానిలో శుభ్రము గ తోమి పిమ్మట అయిదునిమిషములవరకు మందు నీటిలో నుంచి కడుగుకొనవలెను.

5 రోగినిచూచుటకు ఎవ్వరిన లోనికి పోనియ్యకూడదు. అవసరముండిన బయటనుండియే మాట్లాడునట్లు చేయవలెను. తమఇంటనుండి పిల్లలను బడికి పంపరాదు.

6 రోగియొక్క వాంతివిరేచనములను వెంటనే మందుతో చేర్చి పూడ్చివేయవలెను.

7 రోగి మైలచేసిన బట్టలను మందునీళ్ళలో వేసి పిమ్మట వుడుకబెట్టి ఉతుకవలయును.

8 రోగికి వ్యాధి నెమ్మదియైనవెంటనే మందునీళ్ళలో స్నానముచేయించవలెను.

9 రోగి ఆగదివిడిచినవెంటనే గోడలను నేలను మందునీటితో కడిగి గంధకపుపొగవేసి సున్నము కొట్టించవలెను.

10 రోగివిడిన ఆహారము కాల్చవలెను. లేక పూడ్చవలెను.

11 రోగి చనిపోయినయెడల కళేబరమును మందునీటిలో తడిపిన దుప్పటిలో చుట్టియుంచవలెను. సాధ్యమైనంతత్వరలో దహనక్రియలు జరుపవలెను.

ఉపయోగించవలసిన మందునీళ్లు.

సాపీరము 1 పాలు నవాసాగరము 1 పాలు నీళ్ళు 1000 పాళ్ళు. నీటినికలిపి, లేక కార్బలిక్ మందునీటిని ఉపయోగించవచ్చును.

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు ప్రచురింపఁబడియె.

గీ॥ "ఉద్ధరించెద దేశమే నొక్కరుఁడనె । నిశ్చయంబిది సేయంగ నేరఁడొరుఁడు"
అనుచు "విలియాముపి"ట్టనునతఁడువలికె । అట్టియొల్లరు దలపగనగును శుభము

# సత్యసంధత

చ॥ కుదురుసమస్తధర్మములకున్ వినుసత్యము; యోగమోక్ష స ।
త్పదములు సత్యకార్యములు; పాపమసత్యముకంటె నొండులే ।
దు; దలపనశ్వమేధములతొమ్మిది నూఱులు వెండినూఱునై ।
యొదవిననీడుగావు భరతోత్తమ సత్యముతోడ నారయన్॥ మహాభారతము

సత్యము సకలసద్గుణములకును మూలము. దీనితో సరితూగు సుగుణమింకొకటిగానరాదు. సత్యము నెల్లప్పుడును పలుకుచుండుటయే మనపరమావధి. సమస్తజ్ఞానములును సత్యము నందిమిడియున్నవి. సత్యమే సుఖసంతోషములకునికిపట్టు. ఒక్క సత్యమనుశీలము లేకున్న సుఖములన్నియు జెదరిపోవును. అభివృద్ధియను మహాకట్టడమునకు బునాదియు, గోడలను, పైకప్పునుగూడ సత్యమే. ప్రతిమనుజుని హృదయాంతరాళమునందును జ్యోతివలె వెలుగుచు, సదాచరణశీలునిగావించుచు, మనోధైర్యము నొసగునది సత్యమే. నిజమాడినంతమాత్రమున పేరుప్రతిష్ఠలురాకున్నను, సుశీలమలవడి ప్రజలవిశ్వాసమునకు బాత్రుడగుటనిశ్చయము. సత్యనిష్ఠగలవాడెవరికిని భయపడడు. స్నేహితులని మొగమోటపడడు; పోషించువాడని ముఖస్తుతులొనరించడు. శీలము, న్యాయము, స్వేచ్ఛ- ఇవియే అతని ముఖ్యాదర్శములు.

మనమెల్లప్పుడును నిజమాడుటకు సిద్ధముగనుండవలెను. అబద్ధము పలుకవలసినంత యవసరమెన్నడునుగలుగదు. న్యాయము, నీతి మొదలగు సద్గుణములకాకరమైన శీలమే భూషణముగాగల మహనీయులకు ధనము, అధికారము, పాండిత్యము, మొదలగు నిహసంబంధమైన యైశ్వర్యములు లేకుండినను కొరత లేదు. సత్యసంధుడు నిరుపేదయైనను, నిరక్షరకుక్షియైనను రారాజులకంటెగూడ గౌరవనీయుడనుటకు సందియముండదు. కాని నిరుపేదయగువాడను దినమునుసత్యమే పలుకుచుండుటకు వీలులేదని కొందరనవచ్చును. సత్యసంధతకు బీదతనమడ్డమురాదు. పల్లెటూరునందు వ్యవసాయముచే జీవించు పేదవారనేకులు పట్టణములలో మేడలపై గొపురముచేయు భాగ్యవంతులకంటె నెక్కుడునీతిమంతులుగ నుండవచ్చును. సత్యమనుశీలమేధనము. ఈశీలమే లేకుండిన ధనవంతుడైనను లోకాదరణకు బాత్రుడుకాజాలడు.

అమూల్యమును, సులభసాధ్యమునగు సత్యసంధత్వమలవడుటెట్లు? మహాపురుషుల యుదాహరణములే దీనికిముఖ్యసాధమునము. ఆట్టివారిచరితము ననుసరించిన మనము చాలవరకు నీతివంతులముకావచ్చును. కావున ప్రతిమనుజుడును, ఒక్కమహనీయుని దనమనమునందుంచుకొని, యాతనివలె నడుచుకొన బ్రయత్నించిన దప్పకనీతిపరుడగును. అందరును లక్షాధికారులగుటయును, పలువురొకే గొప్పయుద్యోగము సంపాదించుటయునునసంభవము, కాని సత్యసంధత, న్యాయప్రవర్తన, సద్గుణప్రీతి మొదలయిన సుగుణములు గొప్పవారినుండి

జనులందరును నేర్చుకొనవచ్చును. రాజ్యముపోయినను, అడవులపాలుగావలసివచ్చినను దారపుత్రాదులనుండివినపోవలసివచ్చిడిను, సత్యవ్రతమును నిలుపుకొనిన మహనీయుడు హరిశ్చంద్రుడొక్కడే. ఎన్ని యిడుములు సంభవించినను అబద్ధమాడకుండుటయే నిజమయిన సత్యసంధతకు గురుతు.

నిజమునే మాటలాడుచుండిన్న వ్యవహారములన్నియు సులభములగును. సాక్ష్యసంబంధములతోను, దస్తావేజులతోను మనకంతగాపనియుండదు. పత్రములు వ్రాయించుకొనుటయయి తమనావశ్యకముగ గానుపించును. నమ్మకముండిన నెంతగొప్ప వ్యవహారములైన నోటిమాటలతో జక్కబడును. సత్యమును పలికెడు వారియందందరకును విశ్వాసముపుట్టును. ఇంగ్లాండు దేశములో నొకానొకమంత్రి కొందరికి బాకీయుండెను. ఒకనాడాయన డబ్బును లెక్కించుచుండగా నొకబాకీదారుడు పత్రమునుదెచ్చి తనయప్పును ముందుదీర్చుమని యడిగెను. అంత నామంత్రి యిట్లుచెప్పెను "ఇదియొక చేబదులుక్రింద నీయవలెను. ఒకవేళ నేనుమృతినొందిన దానికాధారమేమియు నుండదు. కావున ఈపైకము నీకిచ్చుటకువీలులేదు." ఈమాటలాయన నోటినుండి వెలువడినదే యాలస్యముగ నాబాకీదారుడు తనపత్రమును జించివేసి "నాయప్పునుగూడ జేబదులుగనె మార్చెదను" అనివెళ్ళిపోయెను. అట్లుచేయుట కాయన కామంత్రియందుండెడి విశ్వాసమేకదా ప్రబలకారణము!

అబద్ధములాడుట మనలో సామాన్యసంగతియైనది. అబద్ధములాడకున్న వ్యాపారముసాగదనియు, సంసారముజరుగ

దనియు, లోకవృత్తమేనడువదనియు భ్రాంతిపడుచున్నారు. అ
నృతవాదిసైతము తానుజెప్పినదెల్ల ప్రజలునిజమని నమ్మవల
యుననియే కోరునుగాని, తానుపలుకుచున్నదంతయు నసత్య
మని లోకులెంచవలెనని కోరడు. సత్యవచోనిరతులనెల్లరు గౌ
రవింతురనియు, అసత్యాలాపకుల నెట్టివారును దగ్గరకుజేరనీ
యరనియు నతనికి బాగుగదెలియును గాన తానాడునదంతయు
నిజమేయని వాదించుచుండును. అట్లబద్ధము సయితము నిజమ
ని యెన్నుటచేతనే మిక్కిలి లాభముకలుగునని తలచుచున్న
అసత్యవాది యెప్పుడును నిజమునేపలుకుచుండిన యెడల విశే
షలాభముకలుగునుగదా! అబద్ధమాడుట పైకిసులభముగ క
నుపించినను, దానిని గప్పిపుచ్చుటకెన్నియో మాయోపాయ
ములు పన్నవలసియుండును. ఎంతజాగ్రతతో నబద్ధమును దా
చవలెనన్నను, ఎప్పుడైన నొకసమయమున నదిబయలుపడక
మానదు. లోకములోనందరును దెలివితక్కువవారుకారు. ఒ
కరిద్దరామోసగానివలలోజిక్కినను, ఎవడో యొకబుద్ధిమంతు
డందలి కృత్రిమమునుకనుగొనియే తీరును. పూతబంగార మెం
తకాలముమెరయగలదు! అసత్యవాది యబద్ధమాడినప్పటి నుం
డియు మనోధైర్యముతగ్గి, యెప్పుడాసంగతి బయల్పడునో, బ
యల్పడిన నెట్టియవమానము, ఎట్టియిక్కట్టులు సంభవించునో
యని మనోవ్యథజెందుచునేయుండును. అట్టియెడ నిజముగా స
త్యమేలోకమునకు వెల్లడియైననట్టి వానిస్థితి నడుగనవసరమే
యుండదు. లోకనిందతప్పినను, అంతరాత్మచేనగు బాధయింత
యని చెప్పుటకుపీలుండదు. కొన్నివేళల ప్రాణహానికలిగినను

కలుగవచ్చును. హాస్యమునకైనను, కొద్దిసంగతులలోనైనను, గొప్పవిషయములలోనైనను, అనృతముపలుకరాదని యీక్రింది కథబోధించుచున్నది. ఒకగొల్లపిల్లవాడొకనాడు గొఱ్ఱెలను కాయుచు హాస్యమునకై యొకమారు 'తోడేలు' అని యరచెను. వెంటనే యాతనిబంధువులాపిల్లవాని రక్షణకై వచ్చి యెగతాళియని తెలిసి మరలివెళ్ళిరి. పిమ్మట నొకనాడు నిజముగ దోడేలువచ్చి గొఱ్ఱెలపైబడిచంపుచుండ, 'తోడేలు! తోడేలు!' అని యెంతయరచినను వానిరక్షణకై బంధువులొక్కరును రాకపోయిరి. అంతనాతోడేలు గొఱ్ఱెలనేకాక, అసహాయుడైయున్న యాపిల్లవానికూడ జంపితినెను.

అనృతమాడుట మనలో నిప్పుడొకయలవాటుగా మారినది. అల్పవిషయములలోను, సంభాషణములమధ్యనుగూడ నిజమునేపలుకువారు మిక్కిలియరుదు. ఈయలవాటువలన, అనేకసమయముల మనమబద్ధమాడుచున్నామనే గమనమేయుండదు. కొందరు వెంటనేకనుగొని పశ్చాత్తాపపడుదురు; కొందరు గతజల సేతుబంధనమేలయని మిన్నకుందురు. ఒకడింటిలో నుండి కూడ నెవరైన దనను బిలిచినప్పుడు లేడనిపించుట మనలో సాధారణమైనది. ధైర్యములేకుండుటయే దీనికిముఖ్యకారణము, ధీరులెప్పుడునట్టి నీచపుబనులకొడబడరు. మాటలాడుటకువీలుకలుగకున్న వీలులేదనియే చెప్పెదురు కాని ధీరులగు వారెన్నడును నింటిలోనుండి లేడనిపించుట కొప్పుకొనరు. మనలోననేకులు 'ఇదొకటియే నేనాడినయబద్ధమనియు,' 'ఇంకొకటి నోరుజారివచ్చినదనియు,' "మరొక్కటి యితరులకు హానికరము.

గాదనియు' సాకులనెన్నియో గల్పించి తప్పించుకొనజూతురు
ఇట్టి చిన్నతప్పిదములజూచి చూడనట్లువదలిననవియే దినక్రమ
మున పెద్దవైదుష్ప్రవర్తన లోనికిదించును. తప్పులు పలుకా
రణములచే గలుగవచ్చును. కానివానినికప్పిపుచ్చక వెంటనే మ
నమనస్సులనుండి పారదోల బ్రయత్నించవలెను. మనస్సునిర్మ
లముగనుండిన నిట్టివెన్నడును మనకుదెలియనిదే నోటినుండి జా
రవు కాన సాధ్యమైనంతవరకు జిన్నవిషయములందు సయితము
మనస్సును పరిశుభ్రముగనుంచవలెను. ఈసారి తప్పనికనెన్న
డు నబద్ధములాడను, అని సరిపుచ్చుకొనుచుండిన నెప్పటికప్పు
డది యొక్కసారియేయగును. అసత్యములతో బాటు అపకీర్తి
యు వృద్ధినందును. ఎట్టివిడరాని యలవాటైనను మనస్ఫూర్తిగ
బ్రయత్నించిన కొలదికాలములోనే దానివిడువగలుగుదుము.
ఒకటరెంట విఫల మనోరథులైనను, నిరుత్సాహులై మరల
బూర్వపుటలవాటుకేదిగక ధైర్యావలంబులై ప్రయత్నించిన వి
జయులగుట నిక్కువము. "కష్టేఫలి' యనెడు నార్యోక్తియె
న్నటికిని వ్యర్థముకాదు. మొదలు కొంచెము శ్రమతీసికొని వి
డువక పనిచేసిన నెట్టికార్యమైనను కొనసాగకపోదు. ఫలముక
ష్టముననుసరించియేయుండును కాని వేరుకాదు. కావున మన
లో నందరును సత్యవ్రతమునుబట్టి నిజమునేపలుకుమని యం
తరాత్మకుబోధించిన కొలదికాలములోనే మనలోసంపూర్ణమై
న మార్పుగలుగుననుటనిక్కము. సత్యమునందు బ్రీతియు,
న్యాయమునందనురాగమును మనలోవృద్ధిబొందును. ఉచ్చరిం
చు ప్రతిశబ్దమునందును, చేయుప్రతిక్రియయందును, సత్యసంధ
తయను సద్గుణము వెలుగుచుండును. పవిత్రములైన యుద్దేశము

లును, ఉన్నతములగు నాదర్శములును మనకప్పుడు కలుగును. ఇట్టి నడవడిని యలవరచుకొనుట కష్టమైనపనియే కాని ప్రజలకాసత్యసంధుని యందెంతగౌరవము, ఎంతనమ్మకముకుదురునో యోచింపుడు!

ఎల్లపుడు నబద్ధమేకూడుగాగల వారినెవ్వరును, ఎట్టిసమయములందును నమ్మరు. అందుచేవారలవలన జనసామాన్యమునకు నష్టమంతగలుగదు. కాని పైకిసత్యమనిన బహుప్రీతి యున్నట్లు నటించుచు, ఉదయము లేచినప్పటినుండియు నసత్యాలాపములాడు మేకవన్నె పులులవలన గలుగునష్టములు పెక్కులున్నవి. అమాయికుల మోసగించుటయే యట్టిదుండగుల ముఖ్యోద్యమము. నిజముతో నబద్ధమునుగూడకలిపి దానివాసన పోకకుండ జనులకు నచ్చజెప్ప బ్రయత్నించునట్టి యీవంచకులవలలలోజిక్కి మోసపోవువార నేకులుగలరు. కావున వారినొకకంటకనిపెట్టియే తిరుగుచుండవలెను. అట్టివారు సామాన్యముగ వాక్చాతురులుగనుందురు. గొప్పగొప్పసభలలో నుపన్యాసములిచ్చుచు, పెద్దలలో పెద్దలుగనుందురు. వారినిజస్వభావమును గనుగొనవలయునన్న సామాన్యవ్యవహారములలో వారినడవడిబట్టియేగాని వేరొండుమార్గమున వలనుపడదు.

కొందరు సత్యవ్రతము నాచరించుచుండినను, నేదైన నొకవివాదము సంభవించినప్పుడు, తామవలంబించిన పక్షమున కనుకూలమగు విషయములనే వెల్లడిచేసి, యెదుటిపక్షమున కుపయోగములగు విషయముల గప్పివైతురు. అట్టివారు చెప్పినదంతయు నిజమేయైనను, నిజమునంతయు జెప్పకుండుట చేతను

వారిసత్యవ్రతము స్వలాభముననుసరించి యుండుటచేతను, వారుకూడ నొకవిధమగు ననృతవాదులేయగుచున్నారు. కావున నట్టివారు నిజమాడుచుండినను తమసత్యసంధతనుగూర్చి గర్వపడనవసరము లేదు. అవసరమగునపుడు మనకులాభకారియైనను, కాకపోయినను నిజమంతయు వచించవలెను. కాని కొంత కప్పిపుచ్చుట సత్యవ్రతులలక్షణము కాదు.

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

గీ॥ "ఉద్ధరించెద దేశమే నొక్కరుఁడనె । నిశ్చయంబిది సేయంగ నేరఁడొరుఁడు"
అనుచు "విలియముపి"ట్టనునతఁడువలికె । అట్లెయెల్లరుదలపగనగును శుభము॥

# ఋజువర్తనము

శా॥ నీతిప్రౌఢవిహారులైన నిపుణుల్ నిందింపనీ మెచ్చనీ ।
ఖ్యాతిం జెందిన సంపదల్ నిలువనీ గాఢంబుగాసాగనీ ।
ఘాతంబప్పుడపొందనీ నియతిమైగానీ యుగాంతంబునన్ ।
నీతిశ్లాఘ్యపదంబుదప్పరుగదా నిత్యంబు ధీరోత్తముల్ ॥ భర్తృహరి

మానవుఁడాచరింపఁదగిన ధర్మములలో సర్వోత్తమమైనది ఋజువర్తనము. ఋజుమార్గమున వర్తించుచుండుటకన్న నీలోకమున నతిశయమైనది మఱొండులేదు. మననోటినుండి వెడలు ప్రతివాక్యమందును సత్యమెట్లావశ్యకమో మన మొనర్చు ప్రతికార్యమునందును న్యాయప్రవర్తన మట్లెయావశ్యకము. ఎల్లపుడనృతములాడుటకు జంకక, ఎట్టిఅకార్యముఁ జేయవలసి వచ్చినను వెనుదీయకుండునట్టి దుష్టవర్తనుఁడు పైకి స్నేహపాత్రుఁడుగఁ గనుపించినను, ఎవరికో యొకరికియెగ్గుఁ గావింపవలయునని యే తలఁచుచుండును. అట్టిదుశ్శీలునికి మనముననొకటి, వాక్కునఁనింకొకటి, చేయునదిమఱియొకటియునై యుండును. కాని ఋజుమార్గవర్తనుఁడు సత్యమునుపలుకుచుండుటయే కాక న్యాయపథమునఁగూడ నడచుచుండును. నిష్కాపటము, మనోధైర్యము, త్రికరణశుద్ధి ఇవియే యాతని నెమ్మొగమున నెల్లపుడుఁ గళకళలాడుసద్గుణములు.

కావున సత్యసంధతకన్న నెక్కుడైనది ఋజువర్తనము. తానిదివఱకొనర్చిన తప్పులనన్నిటిని ఒప్పుకొని, ఇకమీఁద నట్లొనర్పనని చెప్పినఁ జెప్పవచ్చును. కాని తర్వాత నతఁడు చెప్పినచొప్పునఁ బ్రవర్తించినయెడలనే యాతనినటుపై నితరులు నమ్మఁగలుగుదురు. తానొనర్పఁదలపెట్టిన విధమునఁ బ్రవర్తింపని వాఁడిదివఱకు తనయందలి లోపములను, దానొనర్చినయకృత్యములను, ఒప్పుకొనెనుగదాయను కారణముచేతనే యితరులు నమ్మఁజాలరు. ఈతఁడు చెప్పినదంతయు యదార్థమే కాని, తాను జెప్పినట్లు తానే నడచుకొనఁడుగనుక నీతనినమ్మరాదనియే తలంతురు. అందుచే నాతని కెప్పుడు నానిందతప్పదు. అప్పువుచ్చుకొనినవాఁడు తనఋణదాతవచ్చి పైకమడిగినపుడు "అయ్యా! నీవెంతయు మంచివాఁడవు కష్టసమయములలో నాకప్పిచ్చిసహాయము జేసితివి అందులకుఁ గృతజ్ఞుడను. అట్టియెడ నీవు నాకప్పియ్యలేదని యే మొగముతో ననఁగలను నీ డబ్బు నీకీయవలసినదే కాని యిపుడింటధనము లేదు. కావున నొకమాసము దినములలోఁ దమసొమ్మును వడ్డీమొదలిచ్చివేయుదు"నని కాళ్ళను, గడ్డము బట్టుకొని యాతనిబంపివేయుననుకొనుఁడు. ఆ బాకీదారుఁడు చెప్పినదానిలో నసత్యమణుమాత్రమును లేదు. అప్పునిజమనియెను. వడ్డీనిత్తుననెను. ధనిమింట లేనిమాట వాస్తవము. కొన్నినాళ్ళాగుమని బ్రతిమాలిన దప్పులేదు. కాని ఋణదాతమరల నెలజరిగినతరువాత వచ్చినప్పుడును నిదేమాట లా బాకీదారుఁడు చెప్పినచో నపుడెట్టులుండును? బాకీదారుఁడు నిజము నే చెప్పుచున్నాఁడు కాని యాతఁడు కపటవర్తనుఁడని మాత్రము తెలియఁగలదు. ఆతనియందలి నమ్మిక చెడిపోవును. ఎల్లపుడు నట్లేపలుకు

చుండినచో నాతఁడన్యాయముచేయ నెంచెనని తెలిసికొని ఋణదాత తనధనమునకై న్యాయస్థానమున కెక్కవలసివచ్చును. ఇట్లుదినములుగడపి మోసముచేయువారు మనలో ననేకులుగలరు. చెప్పినప్పుడింటిలో డబ్బులేకపోవచ్చును. కష్టపడి తేనక్కరలేదా? ఇట్టివారిని నిజమాడువారని యనవలసివచ్చినను, అక్రమప్రవర్తనగలవారని మాత్రముచెప్పకతప్పదు. చెప్పిన దసత్యమును, చేయునది అక్రమము నచో నెట్టివారును మోసపోరు. కాని పైవిధమున ప్రవర్తించువారివలన ననేకులు మోసపోదురు. ఇట్టివారివలన లోకమునకు నష్టమేకాని లాభమేమాత్రముండదు. అంతియేకాక వారినిజస్థితిఁ దెలిసికొనినవారందఱికిని వారినిజూచిన నొకవిధమైన నసహ్యమును, ద్వేషమునుగూడ జనించును.

బాలుఁడొకఁ డింటియందలికుండల నొకటివెనుక నొకటిగాఁ బగులగొట్టుచు ప్రతిమారును మనవద్దకువచ్చి "నేనేవానినిఁబగులగొట్టితి" నని చెప్పుచుండిన నేమిలాభము? మొదటఁ దెలిసియో తెలియకనో యట్లొనర్చినను, కూడదని చెప్పినతర్వాత నూరకుండిన బాగుండును. కుండలుపగులక బాగుగనుండవలెనని మనయభిప్రాయమేకాని బాలుఁడు తేపతేపకును సత్యమునేచెప్పుచుండునుగదా యని సంతసింపము. అనగా సత్యముపలుకుటకంటెను, చెడుపనిఁజేయకుండుట ముఖ్యము.

అయినను కుండలుపగులగొట్టిన బాలుఁడు తానట్లొనర్చితినని చెప్పనిచో మనమెవరిపై గోపపడగలము ఎవ్వరాదుండగము చేయుచున్నారో మనకుఁదెలియదు. పగులగొట్టినందులకై

బాలునకు చివాట్లైననుండవుగనుక నాతఁడాకుండలనన్నిటిని పాడుచేయును. అప్పుడును నష్టమేకలుగును. కనుక బాలుఁడు నిజముచెప్పుటవలన నాతఁడొనర్చినది తప్పనినచ్చఁజెప్పి యికముందట్లొనర్పవలదని బోధింతుము. సామాన్యముగ నాతఁడుమరల నాచెడుపనిని జేయఁడు. అందు వే మనకుండలు బాగుగనుండును. అదియే మనముకోరునది. ఇట్లాలోచించుటవలన నిజమాడుటచేతనే కుండలు నిలువఁగలిగినవి గనుక సత్యసంధతతప్పనిసరియని తేలుచున్నది.

ఇకనీరెండువిషయములను సమన్వయించుకొనుటెట్లు? ఈలోకమునందలి జనులందఱును వ్యతిరేకాభిప్రాయములను గలిగియుండి యొకరిసౌఖ్యమింకొకరికి కష్టదాయకమనియెంచి యొకరితోనొకరు పోరాడుచుండిన జీవయాత్రగడువదు. ప్రతివానిసంసారమునందును సంక్షోభముజనించును. ఒకరిమాటయనిన నింకొరికి ద్వేషముకలుగును. ఎల్లపుడు నొకరితోనొకరు కలహించుచుండవలసి వచ్చును. మానవఘటములు శాశ్వతములుకావు. కొలఁదికాలమీ సంసారజలరాసి బుద్బుదప్రాయముగ దేలియాడి యంతమునొందును. అట్టిచో నీలోకమంతయు ఘోరజంఝానిలసంచలిత వారిరాసింబోలి, అక్రమముచేనిండియుండిన నామానవఘటములకీ జీవితమునందలి కొలఁదికాలమునందు నెక్కింతయు స్థిమితమను మాటయుండదు. అట్లుగాక జీవితమును - చేతనగువఱకును సంతోషప్రదముగ నొనర్పవలెనని మహాత్ములగువారు కొన్ని మంచియేర్పాటులనుగావించిరి. అందు మానవులొకరినొకరు నమ్మియుండవలెనను సదొక

యేర్పాటు. ఇట్టినమ్మిక ప్రతివానికిని గలుగవలయును. అందులకై ప్రతివాఁడును దానితరులనమ్ముటయు, నితరులుతననునమ్మునట్లు ప్రవర్తించుటయు నత్యావశ్యకము. ఎప్పుడును న్యాయప్రవర్తనగలిగి యన్యులకపకృతిఁజేయనివారల నితరులునమ్మఁగలరు. ఎంతయుఁ బ్రయత్నము జేసి జాగ్రతఁగఁ బరిశీలించినఁగాని "ఈతనినమ్మవచ్చు"నని చెప్పుటకువీలు లేదు. అట్టిపరిశీలన కాతనివచోలక్షణమే ముఖ్యసాధనము, సామాన్యముగ నొకక్రొత్తవానిహృదయము నిర్మలమనము నిర్ణయించుచుందుము. ముఖమునఁ బంగనామములనుదీర్చి దిద్దినవానిని వైష్ణవుఁడనుకొనుటలో దప్పేమియునుండదు. పిమ్మట వానిప్రవర్తన బాగుగ గమనించినగాని వాఁడునిజమైనవైష్ణవుఁడైనదియు, నామధారియైనను వైష్ణవునకుండవలసిన సత్ప్రవర్తనకు దూరగుఁడైనదియుఁదెలియదు. కాని ప్రతివానినడతను జాగ్రతగఁబరిశీలించియే యాతనినమ్ముట సులభసాధ్యము కాదు. అందుచే సత్యమును పలుకుటయే సామాన్యముగ మానవుని నడతను తెలియఁజేయును. అంతియగాక అన్యాయముగఁ బ్రవర్తించువానికి సత్యసంధతవలన నెనగూడుచిక్కులనేకములుగలవు. కావున సాధారణముగ ఋజుప్రవర్తనగలవాఁడే నిజమును బలుకుచుండును. అందుచేనట్టి మనుజుని నమ్మవచ్చుననుటకు సందియము లేదు. అంతియెకాక, అక్రమప్రవర్తనఁగలవాఁడైనను, ఎల్లప్పుడును నిజమునేపలుకుచుండినఁ గొన్నాళ్ళలో నాతనిప్రవర్తనచక్కఁబడును. అప్పుడాతఁడు ఋజువర్తనుఁడగును. ఇంతకు కుండలుపగులకుండుటకై బాలుఁడు మంచివాఁడుకావలెను. నిజమాడినచో బాలుఁడు

పెద్దవారిబోధనలవల్లను, చీవాట్లవల్లను తనదేతప్పని తెలిసికొనును. కావున మంచివాఁడగుటకు వీలుగలదు. కాని నిజముఁజెప్పుచుండియుఁ దనప్రవర్తనఁ జక్కఁబఱచుకొననిచోఁ గుండలకుఁజేటుతప్పదు. అప్పుడునిజమాడుటవలన లాభమునులేదు. సత్యసంధతవలన మనమొకని ప్రవర్తనఁ గనుగొనగలుగుటయే కాక, అట్టివానియందు నానాటికి ఋజువర్తనముకూడ వృద్ధినందును. కావున ప్రతివాఁడును ఋజుమార్గవర్తియై, అకలంకముగు సత్యసంధత్వమునుగలిగి యుండుటత్యావసరము.

యుద్ధసమయము, దేశక్షేమము, ఆర్తత్రాణము, మొదలగు గొప్పవిషయములందు, అబద్ధమాడవలసివచ్చుననియు, అక్రమముగఁ బ్రవర్తింపకతప్పదనియుఁ గొందఱుతలంతురు. అట్టిసమయములలో నేమాత్రమును స్వలాభమునపేక్షింపక, పరోపకారబుద్ధియే ప్రాధాన్యముగఁగలిగి యసత్యమాడినను, అదిఋజువర్తనకే తోడ్పడునుగానఁ దప్పులేదు. అయిననట్టిప్రత్యేకవిధులు మనకిట ననావశ్యకము.

అధర్మవర్తనములనేకవిధములు. మోసము, దొంగతనము మొదలగు దుర్గుణములు చిన్నతనముననే పరిమళించి, వయసువచ్చినపుడు సౌరభమును వెదజల్లును. బడులలో గొడుగులు కలములు గ్రంధములు హరించినబాలురే, పెద్దవాడైనపుడు, గజదొంగలుగనో, అసమానవంచకులుగనో యూరితేరుదురు. న్యాయాధిపతులును, గురువులును లంచములఁదిన మొదలిడి అన్యాయపక్షమునకుఁ జెరువుజేయుటయేకాక, అన్యాయమునకుఁ జేయూతనొసగువారగుదురు.

సత్యసంధత, ఋజువర్తనమను నీరెండుసద్గుణములు సహజతేజోవంతములు. ఈగుణములను గలిగియున్నవారు న్యాయముగ వ్యాపారముచేయ సమర్థులగుటయేకాక, స్వలాభమపేక్షించియైనఁ బరులవంచించ నిష్టపడరు. ఏమార్గమవలంబించిన తమవ్యాపారమభివృద్ధిఁజెందునో కనుఁగొని యాప్రకారముచరింపఁజూతురేకాని, ఒక్కసారిగ ధనవంతులము కావలయుననే దురభిలాషతో, ఉన్న కొంచెమును పోఁగొట్టుకొను నంతటి తెలివిహీనులుగనుండరు. వ్యాపారములందెక్కడఁ జూచినను మనదేశమందు న్యాయప్రవర్తనయే లేదు. తప్పుడుకొలతలుకొలుచుట, తక్కువరాళ్ళువేసి తూచుట, కలితీసరకులనమ్ముట, బంగారపుసొమ్ములని నచ్చజెప్పి పూతబంగారమునిచ్చి మోసగించుట మొదలగు కపటమార్గములు మనముదినదినము జూచుచునేయున్నాము. ఏవ్యాపారముఁ దలపెట్టినను కుత్సితబుద్ధితోనేర్పఱచిన నది కొలఁదికాలములోనే నశించును. అన్యాయవర్తకుఁడు తనక్రయకులను మోసపుచ్చి మొదట నెక్కువలాభము నొందఁగలిగినను వానిమోసముబయటఁబడు కొలదిని వ్యాపారమును జెడిపోవును.

మనలో విద్యాధికులగు కొందఱియందును ఋజువర్తనమనునది కాన్పించదు. ప్రస్తుతము మనమత, సాంఘిక విషయములనేకమార్పులఁజెందుచున్నవి. వర్ణవిభక్తత అరిష్టదాయకమనియు, నందుచేఁ ద్వరలోనన్ని వర్ణములవారును నేకకులముగనేర్పడి వైషమ్యములమఱచి యేకీభావముతో నభివృద్ధినొందవలెనను మహాత్ములుగొందఱేర్పడిరి. వారలున్నతాసనముల

నధిష్ఠించి మహాజనసభలలో "ఓసోదరులారా! మనమందఱమే కీభవింపనిచో నికలాభము లేద"ని గట్టిగబోధింతురు. సంఘీభావముచే నీ,యా, దేశములభివృద్ధినొందినవనియు, వైషమ్యములచే నికకొన్ని దేశములు క్షీణించినవనియుఁ బెక్కులుదాహరణములఁజూపి జనులనమ్మింతురు. కాని వారిలోఁగొందఱు మోసగాండ్రుందురు. వారలయెడ కనుఁగలిగి ప్రవర్తింపవలెను. "శాఖావైషమ్యములువలదంటిరి. మీరును మేమును మిత్రులము, మాతోసంబంధముచేయు"డనిన, అయ్యో కొంపమునిఁగినదనితలంచి, "మీరునేఁజెప్పుదానిని గ్రహించలేదు. మీరు ద్వైతులు మేమద్వైతులము. మీలోనన్ని శాఖలవారొకరితో నొకరును, మాలో నన్ని శాఖలవారొకరితో నొకరును సంబంధబాంధవ్యము లొనర్పనిదే మీకునుమాకును బాంధవ్యమెట్లుకుదురఁగలదనియు, "రజస్వలానంతరవివాహము లే లాభదాయకములైనచో మనమట్లొనర్పుదమా?" యనిన "నట్టిస్థితి యింకనురాలేద"నియుఁ జెప్పువారు కొందఱీనవీనసంఘ సంస్కారరులలోఁగలరు. వారుచెప్పునదిసత్యమైనను, సత్యమైనను తాముచెప్పురీతిని దామేయాచరింపరుగాన నితరులువారలనమ్మజాలరు. వారివలన దేశమున కనర్థముగలుగును. కనుక జనులిట్టి యకృత్యములవీడి ఋజువర్తనఁగలిగియుండుట శ్రేయోదాయకము.

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

గీ॥ "ఉద్ధరించెద దేశమే నొక్కరుఁడనె । నిశ్చయంబిది సేయంగ నేరఁడొరుఁడు"
అనుచు "విలియము పిట్టు" ననతఁడు పలికె । అట్లె యెల్లరు దలపఁగ నగును శుభము॥

# ఆత్మగౌరవము.

అంతరాత్మయొక్క సద్బోధనల ననుసరించి నడుచుకొనుటయే ఆత్మగౌరవమును నిలుపుటకు ముఖ్యసాధనము. కావున, ఆత్మగౌరవమునుగూర్చి నేర్చుకొనుటకుముందు అంతరాత్మయననేమో బాగుగఁ దెలిసికొనవలయును. అందుచే నీవ్యాసమునందు అంతరాత్మనుగుఱించి విపులముగాఁ జర్చింపఁబడును. ఆత్మగౌరవమునుగుఱించి దీనితర్వాత వెలువడు కరపత్రమున వ్రాయఁబడును.

మానవులందఱికిని కొలఁదిగనో, గొప్పగనొ, వివేచనాజ్ఞానము కలదు. అందువలననే పెద్దవారగు స్త్రీపురుషులుమాత్రమే కాక పసివారగు బాలబాలికలు సయితమేదైన నొకపని జరిగినపుడు, అదిమంచిదనియో, చెడ్డదనియో, చెప్పుచుందురు. బాలురుకాని, బాలికలుకాని, యింట నదికావలయు నిదికావలయునని యెల్లపుడును ఆగడములుచేసి తలిదండ్రుల నేడిపింపఁగూడదని విశేషానుభవముకల పెద్దవారికేకాక, చిన్నతనముచే నల్లరిచేయు నాపసివారికిని దెలిసియేయుండును. అందువలననే "తమ్ముఁడెప్పుడును అల్లరిఁజేసి, అమ్మకుఁగోపము కలిగించుచుండును గనుక, ఆతనికేమాత్రమును మిఠాయి బెట్టవ"ద్దని కుమారుఁడు తండ్రికి సలహా నిచ్చుచుండుట సామాన్యముగఁ దటసించుచున్నది. ఇదిమంచిది, ఇదిచెడ్డదిఅని గ్రహింపఁగలశక్తి

మానవులకు అంతరాత్మవలనఁ గలుగుచున్నదని మనము సామాన్యముగ వ్యవహరింతుము. ఈఅంతరాత్మనే కొందఱు మనస్సాక్షియనుటయుఁ గలదు. కాన, అంతరాత్మయనునది మానవునియందు నిరంతరమును బ్రకాశవంతముగ వెలుఁగుచు జ్ఞానతేజమునొసఁగు ఒకానొక పవిత్రమగు జ్యోతివంటి శక్తియని చెప్పవచ్చును.

ఇట్టిపవిత్ర తేజము, ఏమానవునియందెల్లప్పుడును వెలుఁగుచు, ఆతనికి మార్గదర్శియై, సన్మార్గమున నడపించుచుండునో యాతఁడే కంటకావృతమగు జీవితారణ్యమును నిరాయాసముగఁ దాటఁగలుగును. సూర్యకిరణములుకాని, ప్రకాశవంతమగు మఱియే యితరవస్తువునుండి బయలువెడలు కాంతికిరణములుగాని, సాధారణముగ వంకరమార్గములఁ బ్రసరింపక, తిన్నగ సరళరేఖలుగనే పోవుచుండును. ముక్కోణాకారముగల గాజులోనుండియైనను, నీరు మొదలగు కొన్నిపదార్థములలోనుండియైనను, బోవలసివచ్చినపుడు మాత్రమాకాంతికిరణము లొకవైపునకువంగును. అట్టిసమయములందును, మార్గమధ్యముననేవైన నితరపదార్థములడ్డగించిన తరుణములందును, సహజముగ తిన్ననివియు, ప్రకాశవంతములునగు కాంతికిరణములు వక్రతనొంది మాంద్యతవహించును. అట్టివెలుతురు సహాయమున, ఏవస్తువెట్లున్నదియుఁ దెలిసికొనుట కష్టసాధ్యము. అట్లే మానవుని యంతరాత్మకును, ఆతనిజీవితమునందలి కార్యములకును మధ్యకామక్రోధాది దుర్గుణములున్నపుడు, అనగా నీదుర్గుణము లాతనినావరించి, అంతరాత్మబోధించు సంగతులను దిన్నగవిననీయనపుడు, ఆతనికి "ఏదిచేయఁదగు నేదిచేయఁదగ" దను

జ్ఞానమునశించును. అపుడాయనకు మంచిచెడ్డలు రెండునుబ
కటియేయగును. కాని సహజముగ నంతరాత్మ మానవునకు, 'ఇ
దిమంచిది, ఇదిచెడ్డది, ఇదిచేయఁదగును, ఇదిచేయఁదగ"దని
బోధించుచు నాతనిసన్మార్గమున నడపించుచుండును.

అంతరాత్మ మానవునకు నిజమగు ప్రాణస్నేహితునివం
టిది. తనవిధిని నెరవేర్పఁగల స్నేహితునివలెనది మానవునికి
నిర్భయముగఁ దనశక్తికొలఁదిని మంచిచెడ్డలఁ దెలియఁజేయు
చుండును. దుర్మార్గమునఁ బడఁబోవువాని నదిభయపెట్టును.
సన్మార్గగామి కానెంచువాని కుత్సాహమొసఁగును. ఘోరకృ
త్యములొనరించిన వానినది వేధించును. అన్యులబాధింపనెంచి
కష్టములపాలైనవానికి "నీకిదియేశిక్ష" అని తెలియఁజెప్పును. ప
రులమేలునకై స్వార్థత్యాగమొనర్చిన వానికి, కష్టములు నాటం
కములు సమకూడినచో, "కానిమ్ము, నీవేధీరుఁడవగుదువు. వెఱ
చివెనుదీయకు"మని ఉద్బోధించును. ఈవిధముగ బోధించుట
కెన్నటికిని అంతరాత్మ మానవునియెదుటికి, ఒకానొకరూపము
న ప్రత్యక్షముకాదు. నెమ్మదిగా, నిష్కల్మషమగుబుద్ధితో, ఆ
లోచించుకొనుచున్నపుడీ సంగతులన్నియు, ఆతనిమనసునకే
పొడకట్టునట్లుచేయును. అట్టియెడ మానవుఁడు తనకుఁదానే "నే
నొనర్చినపనులలో, అదిమంచిదిదిచెడదనియు, ఇకముందిట్లొనర్చి
న బాగుండును"ననియుఁ దెలిసికొనును. అప్పుడే యాతఁడిదివ
ఱకుఁ దానొనర్చిన పాపకార్యములకై వగచి, పశ్చాత్తాపము
నొంది, ప్రతిక్రియయేమైనఁగలదాయని విచారించును. ఏకారణ
ముచేనైనను, కలహము సంభవించినప్పుడు, కోపోద్రేకముపట్టఁ
జాలక అన్యులతో నాడరానిమాటలనాడియు, పలుకరానిదు

దుర్భాషలుబలికియు, అంతయునయిపోయినవెనుక, ఇంటికివచ్చి నెమ్మదిగయోచించి, గతించినదానికై వగచివగచివేసారి, ఏమియునోనర్పఁజాలక, మనస్తాపమునొందువారు మనలోననేకులు కలరు. కామోద్రేకమునణపఁజాలక, అంతరాత్మ సద్బోధనలను లక్షింపక, దుర్మార్గవృత్తినిజరించి, తదుపరి తమనుదామే నిందించుకొనువారును ననేకులుగలరు. ఇట్లే "నామనస్సుకు న్యాయమనితోఁచిన భంగినిమెలఁగుటఁగదా నాకిన్నికష్టములు సంప్రాప్తమైనవి. కానిమ్ము! రానున్నది రావలసినదేకాని, న్యాయమునకు వ్యతిరేకముగఁ బ్రవర్తించి, నామనశ్శాంతిని జెడఁగొట్టుకొన నిచ్చగింప"నని ధైర్యముదెచ్చుకొని సంతసించు మహాత్ములుసయితము మనలోఁగొందఱు లేకపోలేదు. ఇవియన్నియు నంతరాత్మవలన నేయేర్పడుచున్నవి. ఇట్లు న్యాయాన్యాయవిచక్షణ జ్ఞానమునొసఁగి మానవుని ప్రవర్తననెల్లపుడును జక్కఁబరుపనెంచు, అంతరాత్మకంటెఁ బ్రాణమిత్రుఁడేమెక్కువ మేలొనగూర్పఁగలడు?

అంతరాత్మ మానవునకు పుట్టుకతోనుండదు. శిశువులు జన్మించినవెంటనే, ఆకలివలనను, అదివఱకు గర్భమునందనుభవించి యెఱుఁగని వాయుభారమును అనుభవించుటచేతను, కలుగుబాధవలననుఏడ్తురు. అప్పుడువారికేమాత్రము నొప్పిగలిగిననుగూడ నేడ్చుచుండుటచే పుట్టినప్పటినుండియును మనస్సు పనిచేయుచుండునని తెలియుచున్నది. కాని, మంచిచెడ్డలు విచారింపఁగల జ్ఞానముఅప్పుడేవానికిజనింపదు. అనగా, పశువులవలె నాఁకలియైనపుడాహారమును దినుచు, నొప్పికలిగినపుడేడ్చుచుండుట మాత్రమే వారికపుడు తెలియును. పసిబిడ్డలకు మంచి

చెడ్డలు తెలియకుండుట కిదియే కారణము. భూమిమీఁద జన్మిం
చినతర్వాత, అందలి విషయములతోఁ బరిచయము కలుగు కొలఁది
ని, అంతరాత్మ యేర్పడి వృద్ధినందుచుండును. ఈలోకమునందలి
వస్తువు లెట్టివో, వాని స్వభావ మెట్లుండునో, తెలియనప్పుడు, వా
ని నెట్లుపయోగించుకొనవలెనో, వానియెడఁ దామెట్లు ప్రవర్తిం
పవలయునో, వారికిఁ దెలియదు. అందువల్లనే పసివాండ్రు త
ప్పుచేసినచో, అనుభవము లేకపోవుటచే ననివదలి పెట్టఁబడుదు
రు. అనుభవమే లేనిచో నంతరాత్మయుండదు. ఆకారణమున
వారికి మంచిచెడ్డలు తెలిసికొనుటకు శక్తియుండదు. అప్పుడు వా
రికిని పశువులకును భేదముండదు.

ఇఁక అనుభవమునుబట్టియే అంతరాత్మ యేర్పడినచో
అది అందఱియందును నొకేవిధముననుండు నాయనెడు సందియ
ము తప్పక కలుగును. ఒక్కొకని యనుభవమునుబట్టి వాని యం
తరాత్మ యేర్పడుచుండును. విశేషానుభవము గలిగి, చిన్నప్ప
టినుండియు ననేకవిషయములను నేర్చుకొనుటకు వీలుకలిగిన
వారికి, అంతరాత్మయు బాగుగ నభివృద్ధిఁగాంచును. అట్టివారికి
మంచిచెడ్డల నెఱిఁగి, న్యాయాన్యాయముల విచారించెడిశక్తి
యెక్కుడుగనుండును. మొదటినుండియును కూపస్థమండూకము
లగుటచే ప్రాపంచికవిషయములతో నంతగ సంబంధము లేని వా
రియందును, సంబంధముండియు వానివలన నేర్చుకొనదగినన్ని
నీతులను నేర్చుకొనఁజాలని వారియందును నంతరాత్మ బాగుగ
వృద్ధినొందదు. వారికి మంచిచెడ్డలు బాగుగఁ దెలియవు. బాల్య
మునుండియు, చెడువిషయములతోడనే యెక్కువ సంబంధము
కలిగి, మంచిసంగతుల నంతగఁ దెలిసికొనని వారికిని, మంచిచెడు

గులకుఁగల తారతమ్యము తెలియకపోవుటచే, అంతరాత్మ మంచిస్థితిలో లేదనియే చెప్పవలసివచ్చును. అడవులలో దిరుగుచు, సాటిమానవులనుబట్టి భక్షించుటయందల వాటుపడినక్రూరజాతిమనుజులకది దుర్మార్గమనియు, చేయరానిదనియును; తెలియదు. ఇట్లేతక్కినవిషయములందును, ఉదాహరణములఁ జూపవచ్చును.

ఫలితములనుబట్టియే కార్యముల మంచిచెడ్డలునిర్ణయింపఁబడును. ఏపనినిగాని చేసిచూచినచో దానిఫలితము మనకుఁదెలియఁగలదు. ఇట్లన్నిపనులను స్వయముగ నొనర్చియే వానిమంచిచెడ్డలు గ్రహించుట కష్టసాధ్యమును, కొన్నియెడల నసాధ్యమునుగూడనగును. అట్లగుటవలన ననేకవిషయములగుఱించి బాగుగనేర్చి కొనవలెననినచో స్వానుభవమేకాక నికమఱికొన్ని మార్గములునుకలవు. లోకానుభవముగలిగి, సజ్జనులై, విద్యావంతులైనవారి సాంగత్యమువలన స్వానుభవము లేకయే మనమనేకవిషయములఁ జక్కఁగనేర్చికొనవచ్చును. అనుభవశాలురగు పూర్వులచేనైనను, సమకాలినులచేనైనను, అనేకోదాహరణములతో విపులముగ వ్రాయఁబడిన, పెక్కువిషయములుగల సద్గ్రంథముల నిరంతరము పఠించుచుండుటచేతను, అంతరాత్మసరియగు మార్గముననభివృద్ధినందును. బాల్యమునందు క్రమముగబడికిఁపోయి విద్యనభ్యసింపవలసిన కాలము నాటలవల్లను, అల్లరిపనులఁ జేయుటయందునుగడపి, తుదకు విద్యావంతుఁడు కానివాఁడనుభవింపవలసిన కష్టములననుభవించునపుడాతనికి "అయ్యో! బాల్యమున కాలమట్లువృథఁబుచ్చుటచేతగదా యింతసంభవించిన"దని తోచును. ఇదిస్వానుభవ

మువలన నేర్చికొనినసీతిఁ పోకిరితనమున కలవాటుపడిన బాలురుసయితమనేకులు, నిరంతర విద్యాభిలాషులును, క్రమప్రవర్తనగలవారునగు తమతోడి విద్యార్థులసహవాసముచే మంచివారగుటయుఁగలదు. తమపూర్వపు దుష్ప్రవర్తననువీడి సన్మార్గవర్తులగుటచే వారియంతరాత్మ సత్సాంగత్యముచేత మంచిత్రోవకువచ్చినదని చెప్పవచ్చును. ఎల్లపుడు నసత్యములాడుటకలవాటుపడిన మనుజులొకొక్కప్పుడు, హరిశ్చంద్రాది సత్యవచో నిరతులగు మహానుభావుల చరిత్రములను జదువుటవలనగూడ దమనడతను మార్చుకొనుటకలదు. ఇట్లంతరాత్మ సద్గ్రంథపఠనమువలన సయితము బాగుపడును.

మానవులకు మంచిచెడ్డలనెఱుఁగఁగల జ్ఞానముఅంతరాత్మవలన నేర్పడుచున్నది. అంతరాత్మకు మనస్సాక్షియనియు మారుపేరుగలదు. అదియెల్లపుడును నిర్భయముగ "నిదిమంచిది దిచెడ్డ"దని బోధించుచుండును. కానికామక్రోధాది దుర్గుణములచే జయింపఁబడియున్నపుడు మానవులంతరాత్మ బోధనలను సరిగగ్రహింపలేకఁ బోవుదురు. అట్టిసమయములందును అంతరాత్మమాత్రము బోధింపకుండదు. అందుచే నది మానవునికి ప్రాణమిత్రునివంటిదనవచ్చును. అట్టి అంతరాత్మ మానవులకు మనస్సువలెఁ బుట్టుకతోనుండదు. లోకానుభవము కలుగుకొలఁదిని యేర్పడి వృద్ధినందుచుండును. మంచి అనుభవముకలవారికి అంతరాత్మయు బాగుగనభివృద్ధిఁజెందును. మొదటినుండియు దుర్మార్గముననే మెలఁగువారికి అంతరాత్మయు బాగుగనుండదు. అంతరాత్మ బాగుగ నభివృద్ధినొందుటకు స్వానుభవ

ము, సత్సాంగత్యము, సద్గ్రంథపఠనమునను మూడు ముఖ్య
సాధనములుకలవు.

## ప్రకటన.

ఆంధ్రజనసామాన్యముకొఱకు, నూతనములును, ఉపయోగకరములును, సుబోధకములును, అగువిషయములనుగూర్చి "జ్ఞానప్రసాదినీ ప్రచురములు" అనుపేర మాసమునకు రెండు కరపత్రములచ్చువేయింపఁబడును.

ఇట్లు ప్రకటించుటయందలి ముఖ్యోద్ధేశములు:—

1 జనసామాన్యమును విద్యావంతమొనర్చుట

2 ప్రతివారును దప్పక నేర్చుకొనవలసిన విషయములను గుఱించి తేటతెనుఁగులో బోధించుట.

3 ఏవిషయమునుగూర్చియైన స్వేచ్ఛగ నాలోచించి నిశ్చితాభిప్రాయము నెట్లేర్పఱచుకొనవలయునో వ్యాసములమూలమునఁ దెలియఁజేయుట.

4 విద్యార్థులు దేశాభివృద్ధికెట్లు తోడ్పడవలెనో యెఱిఁగించుట.

ప్రచురింపఁబడిన విషయములు:-(1)హిందూదేశమునందలి జనసామాన్యముయొక్క విద్య, దానినభివృద్ధిచేయువిధము. (2) అంత్యజులు (3) సత్యసంధత (4) ఋజువర్తనము.

ప్రచురింపఁబడు విషయములు:-(1)సద్వర్తనము (2) స్వయంసహాయము. (3) పూనికలేక పట్టుదల (4 విధేయత (5) స్వార్థత్యాగము.

విశేషములు గుంటుపల్లి సుబ్బారాయఁడు, రైలుపేట, గుంటూరు.
అని వ్రాసినఁ దెలియఁగలవు.

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

గీ॥ "ఉద్ధరించెద దేశమే నొక్కరుఁడనె । నిశ్చయంబిది సేయంగ నేరఁడొరుఁడు"
అనుచు "విలియము పి"ట్టను నతఁడు వలికె। అట్లెయెల్లరుదలపఁగ నగును శుభము॥

# ఆత్మగౌరవము 2

మంచిచెడ్డలనెరిగి తగురీతిని తనవిధాయకకృత్యముల నొనర్చువానికి ఆత్మగౌరవము నిలుచును. తనస్థితిగతులకు దగినట్లు మెలగుచు, అనేకగొప్పకార్యము లొనర్చువారియందు జనుల కెక్కువగౌరవముండితీరును. కాని, తానొనర్పవలసినపనుల నొనర్పక, మెలగవలసినరీతిని మెలగనివానికి ఆత్మగౌరవము దక్కదు. వాఁడు సామాన్యమానవునికంటె నొకవాసితరుగనియే చెప్పవలసివచ్చును. కావున మానవులనిపించుకొనదలచినవారందరును, తప్పక, తమతమవిధుల నొనర్పవలెను. జనోపయోగకరములును, స్తోత్రార్హములును, అగు సత్కార్యము లొనర్పవచ్చును; ఒనర్పకపోవచ్చును. బాల్యమునుండియు క్రమమగుశిక్షనొంది, మంచిఅనుభవముకలవారికి అంతరాత్మ బాగుగ నేర్పడి, వృద్ధినందునని క్రిందటి కరపత్రమున వ్రాసియుంటిమి. అట్టిఅంతరాత్మమూలముననే మానవుడు తనవిధ్యుక్తధర్మముల గుర్తెరుఁగగలడు. కావుననే అంతరాత్మయొక్క సద్బోధనల ననుసరించి నడచుకొనుటయే ఆత్మగౌరవమును నిలుపుకొనుటకు ముఖ్యసాధనమనియును వ్రాసితిమి.

తనకుగల తెలివికొలఁదిని మానవుఁడు కారణములకును వానిఫలితములకునుగల సంబంధమును గ్రహింపగలడు. అట్టిసం

బంధమును గ్రహింపగలకొలదిని వాడు తనవిధ్యుక్తధర్మములను గుర్తింపగలుగును. మానవుని తెలివి అనుభవముతో వృద్ధి బొందుచుండును. క్రమశిక్షవల్లను ఆతఁడు తన తెలివిని వృద్ధి జేసికొనవచ్చును. ఎక్కువ తెలివిగలవారికి తమవిధాయకకృత్యములు బాగుగ దెలిసియుండును. వానిని నిర్వర్తించుటయును నిర్వర్తింపక పోవుటయును వారిచేతిలోనివని. నిర్వర్తించిన వారికే ఆత్మగౌరవముదక్కును.

ఇక గొంచెము తెలివితక్కువవారికి మంచిచెడ్డలు బాగుగ దెలియకపోవుటచే బాధ్యత తక్కువనియును, అందుచే సులభముగ వారికాత్మగౌరవము నిలుపగలదనియును మనమనుకొనవచ్చును. కాని యిది సరియగు నభిప్రాయముకాదు. ఏమాత్రము జ్ఞానముకలవారికైనను, ప్రతివిషయమును బాగుతెలిసికొనవలెనను అభిలాష మెండుగనుండును. అనగా ప్రతివాని అంతరాత్మయును, ఇంకను నేర్చుకొని తెలివినభివృద్ధి జేసికొనుమని బోధించుచుండును. కావున నట్టికోరిక మానవునికి స్వభావముతోనుండుననవచ్చును. కావునననే, పసిబిడ్డలనేమిచేయుమనినను, 'ఎందుల'కని అడుగకమానరు. ప్రతివిషయమును తమకుదెలియవలెననియే వారికోరిక కనుక అంతరాత్మయొక్క మొదటియుత్తరువు ననుసరింపనెంచినచో మానవులందరును వీలగునంతవరకు తమబుద్ధివైశద్యము నభివృద్ధిజేసికొని మంచిచెడ్డల నెరుగ బ్రయత్నింపవలెను. దానితో వారిబాధ్యతయును వృద్ధియగును. కనుక, తెలియనిచో బాధ్యతయేయుండదని యూరకొనక ప్రతివాడును కావలెనని ప్రతివిషయమునుబాగుగ నేర్చుకొని తనబాధ్యత నెక్కువ జేసికొనుట యాతని

విధి. ఈవిధి నెవ్వరు నతిక్రమింపగూడదు. అందుచే మానవు లందరికిని సామాన్యముగ విధాయకకృత్యము లోకవిధముననే యుండును. ఎరిగినవారు వానినొనర్పవలయును. ఎరుగనివారు ముందవి యెట్టివో తెలిసికొని తదుపరి వానినెరవేర్పవలయును.

ఆత్మగౌరవమును నిలుపుకొనుటకు మానవులు గమనింపవలసిన విధులనేకములు కలవు. కొందరన్యులను గౌరవించుట యననేమియో యెరుగరు. క్రొత్తవానితోనైనను సాంగత్యములభించినప్పు డాతనితో మైత్రికుదురక పూర్వమే అతిపరిచయము కలవానితోవలె మిక్కిలిచనువుకలిగి మెలగుచుందురు. ఆత్మగౌరవమును ప్రేమించువారెప్పుడును ఎదుటివారితో తమకు గల సంబంధమున కనువగురీతిని వర్తించుచుందురు. వయసు నతనకంటె పెద్దవారగుటనో, ధనధాన్యాదుల నెక్కువగగలిగి యుండుటచేతనో, ఎక్కువవిద్యావంతుడగు కారణముననో, గర్విష్ఠియగుటవలననో, తనతో సమానుడుకాని వానితోసయితము కొందరు చనువుకలిగివర్తింతురు. అది యాత్మగౌరవము కలవానిలక్షణము కాదు. స్నేహితులయెడమాత్రము కొంచెము స్వేచ్ఛగ ప్రవర్తింపవచ్చును కాని, అన్యులకడ సందర్భమునకు దగునట్లు నడచుకొనవలయును. ఒక్కరనుకొనినంతనే స్నేహము కుదురజాలదు. మిత్రులుకాని వారికడ తగుమర్యాదననుసరించి మెలగనిచో నది తమగౌరవమునకే కళంకము దెచ్చును.

కొందరెల్లప్పుడు నన్యులయందలి లోపములను క్రొత్తవారికడ జెప్పుచుందురు. అట్లు చెప్పుటచే తమయందలి లోపములనుగప్పిపెట్టగలమని వారియభిప్రాయము. అన్యులలో నీయా

లోపములున్నవనియు, ఆవిషయములోవారు సరిగ బ్రవర్తింపలేదనియు నెల్లప్పుడు జెప్పుచుండినచో, ఆతప్పులు తమయందు లేవనియు, తమ రెప్పుడును సరిగ బ్రవర్తించువారనియు వినువారు నమ్మెదరని వారనుకొందురు. కాని, అనుక్షణమును ఇతరులయందలి లోపములబరిశీలించుటయందే కాలముపుచ్చువారికి మంచిచెడ్డలెట్లు తెలియగలవనియును, అట్టివారెట్లు సత్ప్రవర్తనగలవారగుదురనియును వినువారు సామాన్యముగ గ్రహింతురు. కావున ఆత్మగౌరవముకలవారు ఇతరులతప్పులనెన్నుటయందే విశేషకాలము వ్యయపర్చక, పరులనుగురించి మాట్లాడవలసినపుడెల్లను వారిమంచిగుణములను గురించియే ముచ్చటింతురు. అందువలన వారికి సద్బుద్ధులును పట్టుబడగలవు.

మరికొందరితరులెంతటి ఘోరకృత్యములొనర్చుచుండినను పదుగురిలో మంచివాడనిపించుకొనవలెనని చూచుచునూరకుందురు. ధనికునితో విరోధమువచ్చిన భుక్తిగడువదనియు, అధికారికి కోపముగలిగించిన ఉద్యోగమునకు హానికలుగుననియు దలంచి, ‘తమరొనర్చినదితప్పని’ యితరులతో నొక్కింతయుజెప్ప సాహసింపనివారును కొందరుకలరు. ఆత్మగౌరవపోషకులెన్నటికి నిట్టివిషయములలో భయపడరు. తప్పుచేసినవారెంతటివారైనను, వారిదకృత్యమని తెలియజెప్పుట తమ విధియనియెంచిరేని ఆత్మగౌరవముకలవారప్పుడే వారినిగట్టిగ మందలింతురు. న్యాయప్రవర్తనవలన తమకురానున్నకష్టములనెంతమాత్రమును వారులక్ష్యపెట్టరు. చెప్పనెంచినది యెదుటనే చెప్పుదురుకాని ముఖముచాటున చుల్కనగమాట్లాడుటయు

వారియాచారముకాదు. చెప్పవలసివారొనర్చినదితప్పని మాత్రముచెప్పెదరు. కాని వారినంతగనిందింపరు.

కొందరు జనులెల్లప్పుడును తమకగత్యములేనివిషయములందును శ్రద్ధదీసికొందురు. ఎచటయేపనిజరుగుచున్నను ముందుపిలువనిపేరంటమునకు వారుతయారగుదురు. అందుచేవారు చాలమంచివారనియు, అన్నివిషయములందును సమానముగ పనిజేయునెంచు స్వార్థత్యాగులనియు నెవ్వరునుదలంపరు. తమతోపనియుండినచో నితరులు వారినితప్పకపిలుతురు. తాము తప్పకచేయవలసినపనియుండిన వారచటికిపోవలసినదే కాని, ఆత్మగౌరవముకలవారు మాత్రము తామొనర్పవలసిన పనిలేనప్పుడును, తమనితరులుపిలువనప్పుడును ప్రతిచోటునకును బోవుచుండరు.

ఇతరులు చెప్పుకొనుసంగతులలన్నిటిని గ్రహించి యంతటను వ్యాప్తముచేయుట కొందరికి ముఖ్యమైనపని. అట్టివారియొద్ద వివేకమనుమాటసున్న. తామెక్కడెక్కడనో విన్నసంగతులనన్నిటిని ప్రతివానికడను జారవిడుచుటమాత్రము వారికిదెలియును. ఆత్మగౌరవముగలవారట్లుగాక, ఎప్పుడెవరికడ నెట్లుమాట్లాడవలయునో ఆలోచించి తగురీతిని బ్రసంగింతురు. వారిమూలమున నొకరిరహస్యములు మరియొకరికడ వెల్లడికాజాలవు. వారివలన నెట్టివారిమనమునకును కష్టముగలుగదు అంతియకాక వారినందరును గౌరవింతురు.

స్నేహితులట్లు ప్రవర్తించి గుట్టుమట్టుల బాగుగదెలిసికొనిఅందుమూలమున నితరులకు కీడొనరింపజూచు దుర్మార్గులు

కొందరుందురు. మంచిచెడుగుల నాలోచించి తమవిధ్యుక్తధర్మములను గుర్తింపజాలక దేశద్రోహులై సాటిదేశీయుల కష్టములపాల్సేయు దుర్మార్గులుకూడనీ తెగలోనివారె. అట్టివారికుచేష్టితములవలన ననేకరాజ్యములు నశించినట్లు చరిత్రలవలన దెలిసికొనవచ్చును. వారెంతటిప్రయాసపడినను కడుపుమంట జల్లార్చుకొన నిన్ని గంజినీళ్ళకుగావలసిన ధనములభించుటయే కాని వారికేమాత్రమును కీర్తిదక్కదు. వారిమొగముజూచినంతనె ఇతరులసహ్యించుకొందురు. అట్టివారినెవరును దరిజేరనీయరు. ఎచటికిబోయినను వారికిఛీవాట్లేగతియగును. వారినెవ్వరును గౌరవింపరు సరిగదా, మీదుమిక్కిలి వారిమొగముపడినపుడెల్లనందరును ఉమియుచుందురు. వారిలోమిక్కిలినేర్పరులై గొప్పగొప్పదేశముల దమలంచగొండి తనముచే నాశముగావించువారి దుష్కీర్తి తరతరములవరకు వ్యాపించుచుండును. అందుచే ఆత్మగౌరవము నిలుపుకొననెంచువారెవ్వరు నాపనిపై బెట్టుకొనగూడదు. ఏదేని యుద్యోగములోనుండి తనయధికారబలిమిచే తాబేదార్లదగ్గర లంచములగొనువానికిని ఆత్మగౌరవమనుమాటయుండదు. మర్యాదగలవాడెన్నడును తానితరులవద్ద లంచములకై చెయిజాపడు. ఎంతటిఅవసరముసంభవించినను తానొకరికి లంచమునొసగడు.

ఆత్మగౌరవమిట్టిదని తెలిసినవాడెన్నడును తనశక్తికిమించిన వాగ్దానములొనర్పడు. ఒనర్చెనుపో శక్తికొలదిని నెరవేర్పప్రయత్నించియేతీరును. మనయిప్పటిసంస్కారులవలె నొకటిరెండువిషయములలో చేయుదుమన్నరీతిని జేయలేకపరిహాస

పాత్రులగుచుండియు, ఇంకను నేనిదిచేసెద నదిచేసెదనని డంబము లెన్నడు నాతడుపలుకఁడు.

తనమాటల నితరులునమ్మవలెనని ఆత్మగౌరవము కల వాఁడెన్నడును ఒట్టుబెట్టుకొనఁడు. నిరంతమును బాసలుచేయుట, అసత్యాలాపకునకే తగియుండును. తనమాటల నితరులు నమ్మిననను నమ్మకున్నను ఆత్మగౌరవముగలవాఁడు చెప్పదలచిన దానిని చెప్పితీరును. ఒరులునమ్మలేదని అతనికేమాత్రమును చింతయుండదు.

ప్రతిసందర్భమునందును బాగుగనాలోచించి తనబుద్ధికి న్యాయమని తోఁచినవిధమున నడచుకొనువానికే ఆత్మగౌరవమునిలుచును. ఏమాత్రము నాలోచించక అప్పటికప్పుడు తోచినట్లు ప్రవర్తించువానినిగురించి యితరులకు సదభిప్రాయముండజాలదు.

ఆత్మగౌరవము నిల్పుకొనదలచువారికి అల్పులతోఁడను, దుర్మార్గులతోఁడను సాంగత్యముతగదు. అంతియకాదు. వారలతోవిరోధముకూడపనికిరాదు. విద్యాధికులై, ముప్పదినలుబది యేండ్లపైబడి, ఉద్యోగములొనర్చు పెద్దవారు పసివారలతో స్నేహమొనర్చి, వారిలో కొందరితో నాడుకొనుటయు, మరికొందరితో తగవులాడుటయు వారిస్థితికేమాత్రమును తగియుండదు. అట్లే, విద్యాబుద్ధులనేర్చి, గౌరవముగా నలుగురిలో దిరుగుచు కొన్ని బాధ్యతలనుగలిగి యుండువారలు, మూర్ఖులై, దుర్మార్గమునమెలగు తుచ్ఛులతో సంబంధము గలిగిం

యుండుటయు, తమకంటెను మిక్కిలితక్కువస్థితిలోనుండి అంత గతమబాధ్యతల నెరుగజాలని కొలదివారలతో నెక్కువసంబంధము కలిగియుండుటయునుగూడ వారిఆత్మగౌరవమునకుభంగముకలిగించును. చిరాకును, ఉద్రేకమును తగదని గొప్పగొప్ప పదవులలోనుండువారుసయితమొకొక్కప్పుడు అత్యల్పవిషయములందును కలతజెంది కోపమునగుపర్చుచుందురు. కాని తమ యున్నతస్థానములును, తాము నెరవేర్పవలసినవిధులను గమనించి తమ యుద్రేకము నణచికొనుట ఆత్మగౌరవముగల వారిలక్షణము.

దేశమునందలి మనజులందరు ఆత్మగౌరవమును గలిగియుండుటయే జాతీయగౌరవమునకు చిహ్నముకావున మానవులందరిలో తమజాతీయగౌరవమును నిలుపుకొనదలచువారందరును తమతమఆత్మగౌరవమునకై ప్రయత్నించినజాలును.

---

*N. B:*— ప్రచురింపబడినవి —1 హిందూదేశమునందలివిద్య 2 అంత్యజులు 3 కలరా 4 సత్యసంధత 5 ఋజువర్తనము 6, 7 ఆత్మగౌరవము.

ప్రచురింపబడునవి — 1 కాలముయొక్క విలువ 2 విధేయత 2. పూనికలేకపట్టుదల.

☞ విశేషములు గుంటుపల్లి సుబ్బారాయుడు, రైలుపేట, గుంటూరు, అనివ్రాసిన తెలియును.

---

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

గీ॥ "ఉద్ధరించెద దేశమే నొక్కరుఁడనె । నిశ్చయంబిది సేయంగ నేరఁడొరుఁడు"
అనుచు "విలియముపిట్టను" నతఁడు వలికె। అట్లెయెల్లరుదలపఁగ నగును శుభము"

# కాలము యొక్క విలువ.

కాలమతివేగముగ గడచుచుండును. గతించిన కాలమెన్నటికిని మరలరాజాలదు. దినముగడచిన మరియొకదినము రావచ్చును కాని ఆదినమే మరలవచ్చుటదుర్లభము. ఇట్లు, ఒకటివెనుక నొకటిగ దినములుగడచినకొలదిని మానవజీవితము క్షీణించుచుండును. అమూల్యమగు జీవితమిట్లు గడచిపోవుకొలదిని భయంకరమగు మరణము సమీపించుచుండును. కనుక, కాలవ్యయముకంటె దుఃఖకరమగుసంగతి మరియొకటిలేదు. ఇది ప్రతివానికిని తెలిసినవిషయమే.

పూర్వయుగములలో ననేకులు కొన్నివేల సంవత్సరములవరకును జీవించిరని మనవారు కొందరిప్పటికిని చెప్పుచుందురు. కాని మన యీకలియుగములో మాత్రము తిన్నగ నూరు సంవత్సరములు బ్రతుకగలవారలేయరుదు. ఇంగ్లాండు మొదలగు పాశ్చాత్యదేశములలో కొన్నిటియందు సామాన్యమానవుడు సుమారు ఏబదిసంవత్సరములవరకును జీవించునందురు. మన హిందూదేశమునందన్ననో, మొత్తముమీద సామాన్యమానవుడు సుమారు ముప్పదిఅయిదు సంవత్సరములకే చనిపోవుచుండును. ఇట్టి కొలదిజీవితమునందుసయితము - విశేషాంశము కాలకృత్యముల నిర్వర్తించుటయందును, నిద్రపోవుటయందును గడపవలసివచ్చును. ఇక ప్రతివాడును జాగ్రదావస్థలో విని

యోగింపగల కాలమతిస్వల్పము. కాని నెరవేర్చవలసినవిధులు మాత్రమనేకములుగలవు. ఇట్లాలోచించినచో మానవుని జీవితమునందలి ప్రతినిమేషమును ఎంత అమూల్యమైనదో బాగుగ బోధపడగలదు. అప్పుడే తమజీవితములను సార్థకపరచుకొన దలచిన వారెంతజాగ్రతగ కాలముగడపవలసినదియును గుర్తెరుగగలరు.

మనలో ననేకులీకాలముయొక్కవిలువ నెరుగక మోసపోవుచున్నారు. ఏపనిచేయవలసివచ్చినను "ఈనాటికింత అలసియుంటిమిగదా రేపాపనిని జేయవచ్చునులే"యని యూరకుందురు. రేపను స్వభావముగల వారెన్నడును ఏపనినిగాని తరుణమునందు మొదలుపెట్టజాలరు. అనుదినమును వారికేవియో ఆటంకములు కన్పట్టుచునేయుండును అట్టివారూరక రేపురేపనుచు కాలమునంతను గడపి చిట్టచివరకు పనిముగించుటకు కాలముచాలదని చింతింతురు. సోమరితనముచే నారంభమునుండియు చదువ మొదలుపెట్టక సంవత్సరాంతమున పరీక్షలుసమీపించినపుడు కాలముజాలదని త్రొక్కుడుపడు విద్యార్థులనేకులు గలరు. అజాగ్రతచే మొదటినుండియును చదువునకై వినియోగింపవలసిన కాలమును ఆటపాటలయందుగడపుటచే తుదకు ఏపాఠముల నెప్పుడుచదువుటకుదోచక విద్యార్థులొకదానినైనను ముగింపకయే పరీక్షకుపోవలసివచ్చును. వారాసంవత్సరము జయముగాంచజాలరు. తరువాత సంవత్సరమునందైనను మొదటినుండియు మేల్కొని కృషిచేసినచో కడతేరిన గడతేరవచ్చును. కాని గతించిన సంవత్సరము మాత్రమూరకగడచినదేయగును. ఎంతపశ్చాత్తాపమునొందినను మరలరానేరదు. ఇట్లే సోమరితన

ముచే అదనున విత్తనములుచల్లక వానకాలమంతను గడపు కృషికులును సంవత్సరమునందంతయును తినుటకు గింజలు లేక మాడవలసివచ్చును. కావున ఎన్నటికిని యేపనినికాని రేపనిజాగుసేయరాదు. రేపను దినమెన్నటికిని రాదని రూఢిగనమ్మవలెను.

ఏపనినైనను మొదటినుండియు సక్రమముగ జేయుచుండవలెనని మనఆచారములవలన సయితము దెలిసికొనవచ్చును. ఎవనికైనను సంవత్సరాదిపండుగ దినమెట్లుగడచునో అట్లే సామాన్యముగ సంవత్సరమునందు దినములన్నియును ఉండునని మనవారలనేకులు జెప్పుచుందురు. సంవత్సరమంతయును మనమెట్లుకష్టపడి పనిజేయుటయందును, సౌఖ్యములనుభవించుటయందును గడపనెంతుమో, అట్లే ఆసంవత్సరపు ప్రథమదివసమగు సంవత్సరాదినాడును ప్రవర్తింపవలెనని వెనుకటివారియభిప్రాయమయియుండును. ప్రారంభమునందే తనవిధాయకకృత్యములు శక్తికొలదినొనర్చి సంతృప్తిజెందగల మానవుడు, ఆసంవత్సరమునందన్ని దినములయందును అట్లే తానొనర్చవలసిన పనులనొనర్చి సంతోషముతో కాలముగడుపగలడని తలంచుటకేమాత్రమును సందియముండరాదు.

ఇట్లు మొదటినుండియును కాలముననుసరించి యెప్పుడు చేయవలసినపని నప్పుడుచేయుచు, యథావిధిగ తనపనులచక్కబెట్టుకొనువానికి మనశ్శాంతియెప్పుడును చెదరకయుండును. కాని, ఏపనినిగాని ప్రారంభించినపుడు విశేషముగకష్టించి పిమ్మట కొన్ని నాళ్ళవరకును దానివిషయమై తలపెట్టక యూరకొని

మరల దానిని సకాలములో నిర్వహింపనెంచినవాడు విశేషము కష్టపడవలసివచ్చును. ఒక్కొకప్పుడు కష్టమెంతపడినను ఫలితము లేక నేపోవచ్చును. నడివడిగా నాలుగుబారలుదుమికి నెమ్మదిగ నడచుచుండిన తాబేలింకను వెనుకనేయున్నదిగదా, ఇంతలో కొంచెము నిద్రపోయినంతమాత్రముననే దానికంటె ముందుగ గమ్యస్థానమును చేరలేకపోవుదునా, ఇప్పటినుండియు కష్టపడనేమిటి కనుకొనినకుందేలు, నెమ్మదిగ ప్రాకులాడుచు, ఎక్కడను ఆగకుండినతాబేటికంటెను వెనుకబడినకథ మనకందరికిని తెలియును.

కాలముయొక్క మాహాత్మ్యమును పూర్తిగ నెరుగుట కెట్టివారికిని సాధ్యముకాదు. అదిస్థితిగతులనుబట్టి మారుచుండును. ఒక్కొకప్పుడు దానిని గ్రహించుటకుకూడ దుర్లభముగానుండును. యుద్ధములయందును, కోర్టువ్యవహారములందును పరిచయముగల వారిసంగతిని బాగుగ గ్రహింపగలరు. వాయిదాగడచిపోకముందు దాఖలుచేయవలసినయే చిన్నికాకితములనో దాఖలుచేయకమరచిపోయినచో అనేకవేలరూపాయల నష్టమొక్కక్షణములో సంభవించును. ఆక్షణముగడచినవెనుక నేమిచేసినను వ్యవహారముచక్కబడదు. అట్లే యుద్ధసమయములందును ఒక్కొక్కనిముస మనేకకోట్లరూప్యములకన్న నెక్కుడువెలగలిగియుండును. ఏపర్వత పంక్తులనాక్రమించుటయందో, ఏమహానదులను రహస్యముగ దాటుటయందో, వైరిసైన్యములకంటె నొక్కయరఘడియ వెనుకబడినంతమాత్రమున ఎన్నియోకోట్ల పౌనులనష్టమును, ఎన్నియోలక్షలజననష్టమును, అనుభవింపవలసివచ్చును. ఇంతియకాక, యుద్ధమునందు, ఆసంబంధమగు సంగ

తులనుగనుగొని యందరికంటె ముందుగ దెలియజేయగల వార
లకెంతయేని బహుమతు లిచ్చుచుందురని మనమనేకమారులు
వినియున్నాము. పరీక్షపత్రములీయబోవు సమయములో నికకొ
న్ని నిముసములు విశ్రాంతిగలదనినచో పరీక్షార్థులెంత సంతసిం
తురో విద్యార్థులకే బాగుగ తెలియగలదు.

ఇట్టిసందర్భములలో ముఖ్యముగ జనులెక్కువ జాగ్రత
గలిగియుండవలెను. కాని, అత్యవసరమగు విషయములందు
కూడ మానవులు మూఢనమ్మికలుగలిగి కాలాతిక్రమణగావిం
చుట మిక్కిలి యరిష్టదాయకమగుచున్నది. కలరాతగిలి బాధ
పడుచు, అవసానదశయందున్న రోగులకు మందులనీయబోగా
నెక్కడనో ఎవ్వరో తుమ్మిరనుకారణముచేత మందుమ్రింగక
జాగుజేసి చేజేతుల ప్రాణముల దీసికొను మందబుద్ధులనేకులు
గలరు. వ్యాజ్యమువచ్చినదని రైలుమించిపోవుచున్నను చూచు
చునూరకుండువారలను, దరఖాస్తు చేయుటకు మంచిదినముదొ
రకలేదని యుద్యోగముల బోగొట్టుకొనువారలను మనదేశము
నందువలె లోకములో నేదేశమునందును గనజాలము.

ఈవిషయములనన్నిటిని బాగుగ గమనించి జనులందరు
ను తమతమజీవితమునందలి ప్రతిదినమును బాగుగ నుపయోగిం
చుకొనవలయును. అప్రయత్నముగనే కాలము వేగముగగడచి
పోవుచుండును. దానినట్లుపోనీయక, ఎల్లప్పుడును పనిబాటల
యందుపయోగించుటకై మనము ప్రయత్నించవలయును. ప్రతి
మనుజునకును జేయవలసిన విధాయకకృత్యము లనేకములుగల
వు. తనకొరకును, తనపైనాధారపడియుండు తల్లిదండ్రులకొర

కును, భార్యాపుత్రులకొరకును, మాత్రమేకాక చుట్టుప్రక్కల నుండు జనులందరిసౌఖ్యముకొరకును మానవుడు ప్రయత్నింపవలసియున్నది. గ్రుడ్డివారికిని, కుంటివారికిని సాయమొనర్చుట కాళ్ళుచేతులు కలవారికి విధియైయున్నది. లోకమునందలి జనులందరును సోదరమాత్రులనియును, వారిసౌఖ్యమే తనసౌఖ్యమనియును, దేశమునందేభాగమున క్షామము సంభవించినను అన్ని భాగములవారికి నదిదుఃఖభాజనమేయనియును ప్రతివాడును దలంపవలయును. పరోపకారబుద్ధితో నిట్లందరిసౌఖ్యమునకై పాటుబడువానిజీవితమే, ఆతనికిని లోకమునకునుగూడ మిక్కిలి ప్రయోజనకారిగనుండును. అట్టివానిజీవితములో నొకక్షణమైనను వ్యర్థముగ గడపలేదని చెప్పుటకేమియు సందియముండదు. కొలదికాలము బ్రతికినను,అట్టివానికీర్తి దేశమంతటనువ్యాపించి జీవన్మృతుని జేయును. కాకులవలె, ఉదరపోషణార్థమే పాటుపడువారు చిరకాలముజీవించినను, వారిజీవితమునకేమాత్రమును వెలయుండదు. కొన్నివేళలనట్టివారిబ్రతుకు సంఘమునకును, దేశమునకును నరిష్టముగగూడనుండును. కీర్తిలేకపోగ నపకీర్తికి పాలుగావలసివచ్చును.

పైవిధమునగాక నజాగ్రతగ కాలముబుచ్చువారే మాత్రమును తమవిధుల నొనర్పజాలరు. వారేమొనర్పవలయునో తెలియకబోవుటచే నెల్లపుడు వారికితీరికయుండును. త్రొక్కుడి లేనిదారిని ముండ్లకంచెలు మొలచునట్లు పనిబాటలులేనివాని మనస్సునకు దుర్బుద్ధులు పుట్టుచుండును. ఎల్లపుడు నేదియో దుర్మార్గముచేసి, పరులబాధలజూచి సంతసింపవలెనని వానిమనమువ్విళులూరుచుండును. వీలయినచో నామూలమునసే పొట్ట

పోసికొనవలెననియు నట్టివారు ప్రయత్నింతురు. కొలది చదువుగలిగి ఉద్యోగమునకనర్హులై, తమవిధాయకకృత్యముల నెరుగక వేరువిధమున పొట్టబోసికొనజాలని తగవులమారు లీతరగతిలో జేరుదురు. వారిపైవీరికిని, వీరిపైవారికిని తగవుకల్పించి రచ్చలకీడ్చుటయన్న వారి కమితసంతోషకరము.

పనిబాటలు లేక, కాలముయొక్క విలువ నెరుగజాలని మరికొందరెల్లప్పుడును నాటపాటలయందును ఆగాలికబురులయందును, చిల్లరతగవులయందును, ప్రొద్దుబుచ్చుచుందురు. ఇదియెంతమాత్రమునుతగదు. జాగరూకులమై మనజీవితమునంతటి నుపయోగించుకొనవలయును గాని పాడుచేసికొనగూడదు.

కాలమమూల్యమైనది. ధనమును సంపాదించుటయును కష్టమే. సంపాదించిన ధనములో కొంతపోగొట్టుకొనినను, తెలివియును సమర్థతయునుగలవారు మరల మూడుదినములలో కావలసినంతధనమును సంపాదించిన సంపాదింపవచ్చును. లేదేని వ్యయమగుమార్గము లెవ్వియో గ్రహించి వానినితగ్గించుటవలనను ధనవ్యయమునాపవచ్చును. లేనిధనమును సంపాదించుటకంటెను, చేతిలోనిధనమును పోగొట్టుకొనకుండుటయే మిక్కిలి సులభమైనపని. కాని కాలమువిషయములో మాత్రము మానవునిశక్తి యెందులకును గొరగాదు. ఎంతటిధనవంతుడైనను, ఎంతటిమేధాశాలియైనను, ఈయతివేగమగు కాలప్రవాహము నూరక చేతులుజోడించుకొని చూచుచుండవలసినదే. సముద్రతరంగములనాగుడని యాజ్ఞాపించిన యొకానొక రాజువలెనే తమబుద్ధిబలముచేతను, తమఅధికారముచేతను కాలప్రవాహము నాగనాజ్ఞాపింపనెంచు మహాత్ములు సయితము విఫలమనోరథులగుదురు.

మనమెంత ప్రయత్నించినను గడచిపోయిన నొకయరనిముష మైనను వెనుకకురాజాలదు గనుక మనజీవితమునందాదినుండి యంత్యమువరకును, ప్రతినిముషమును మొదటనే బాగుగనా లోచించుకొని తగురీతి నుపయోగించుకొనవలయును. మీాదచిం తించిన లాభ మేమియునుండదు.

# ప్ర క ట న.

ఆంధ్రజనసామాన్యముకొరకు, నూతనములును, ఉపయో గకరములును, సుబోధకములును, అగు విషయములనుగూర్చి, "జ్ఞానప్రసాదినీ ప్రచురములు" అనుపేర మాసమునకు రెండు కరపత్రములచ్చువేయింపబడును.

ప్రచురింపబడిన విషయములు:—1 హిందూదేశమునందలి విద్య 2 అంత్యజులు 3 కలరా 4 సత్యసంధత 5 ఋజువర్తనము 6 7 ఆత్మగౌరవము 8 కాలముయొక్క విలువ.

ప్రచురింపబడు విషయములు:—1 విధేయత 2 పూనిక లేక పట్టుదల 3 స్వయంసహాయము 4 స్వార్థత్యాగము.

విశేషములు గుంటుపల్లి సుబ్బారాయడు, కైలుపేట, గుంటూరు. అనివ్రాసిన దెలియగలవు.

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

గీ॥ "ఉద్ధరింపెద దేశమే నొక్కరుఁడనె । నిశ్చయంబిది సేయంగ నేరఁడొరుఁడు"
అనుచు "విలియముపి"ట్టనునతఁడువలికె । అట్లైరయెల్లరుదలపఁగనగును శుభము॥

# వి ధే య త.

విధేయతయన కొంచెమో గొప్పయో ప్రతివానికిని తెలిసియేయున్నది. తలిదండ్రులు, ఉపాధ్యాయులు, మొదలగు పెద్దలయొక్క ఆజ్ఞలనుమీరక నడచుకొనువానిని విధేయుడనియు, వారిమాటలలెక్కిఁపక తనకుతోచినట్లు నడచుకొనువానిని అవిధేయుడనియు సామాన్యముగ మనమనుకొనుచుందుము. అనుభవశాలురును, ఎక్కువవిద్యావంతులును అగు పెద్దలమాటనతిక్రమించుట సామాన్యముగతగదు. కాని, పెద్దవారలుసయితము పొరపడుచుండుటయును అప్పుడప్పుడు తటస్థించుచుండును. కావున యుక్తాయుక్తముల విచారించి ప్రతివాడును వలయునప్పుడెల్ల విధేయతచూపుచుండుటయే మంచిది.

పెద్దవాడగుకొలదిని మానవుని అనుభవము వృద్ధియగుచుండును. పసిబిడ్డయై తల్లియొడిలోనుండి పాలుద్రావిన బాలుడే కొన్ని యేండ్లుగడచినతర్వాత బడిలోచదువుకొను విద్యార్థియు, పిమ్మట కొన్నినాళ్ళకు వయోవంతుడును, చివరకు లేవలేని వృద్ధుడును అగును. ఇట్లే మానవునిఅవస్థలు మారుకొలదిని అనుభవమును మారుచుండును. అందుచే, బాల్యావస్థలో తలిదండ్రులయెడ కనుపరచవలసిన విధేయతకును, బడిలోగురువులయెడ జూపవలసిన విధేయతకును చాలవ్యత్యాసముకలదు.

బాల్యావస్థయందు తలిదండ్రులు చెప్పినట్లు నడచుకొనుట పిల్లలకు విధియైయున్నది. ఇంటిలో పెద్దవారిమాటలవినక, తమయిచ్ఛవచ్చినట్లు దిరుగుచు, చెడ్డవారిసహవాసముచే, ఎందులకును పనికిరాని పిల్లలనెందరినో మనముజూచుచున్నాము. పసివారలకు అనుభవములేకపోవుటచే మంచిచెడ్డల నెరుగగలజ్ఞానముతక్కువగనుండును. అట్టిసమయమున, ఎక్కువప్రాపంచికజ్ఞానముకలిగి, మంచిచెడ్డల శీఘ్రముగ గ్రహింపగల తలిదండ్రుల ఆజ్ఞలజవదాటక వర్తించుటయే పిల్లలకుమిక్కిలిశ్రేయస్కరము. కాని తాముచెప్పినట్లెల్ల చేయుచుండుట పసివారికి విధియని పెద్దలెప్పుడును ఊటికిమాటికి వారినిదండింపగూడదు. తప్పొనరించిన సమయములలో దండింపవలసివచ్చినను వారొనర్చినపనిలో నెక్కడ తప్పుకలదో దానినెట్లుదిద్దుకొనవలెనో తెలియజెప్పుటయే మిక్కిలియవసరము. లేనిచో తమనేల తలిదండ్రులు దండించుచున్నదియును తెలిసికొనజాలక కారణములేకయే కోపపడుచుండుట వారిస్వభావమని వారుదురభిప్రాయపడుదురు పిమ్మట వారియెడల నేమాత్రమును విధేయతజూపకుందురు. పైనచెప్పువారులేక అట్టిబాలురతిశీఘ్రకాలముననే చెడిపోవుదురు. అప్పుడాలోపమంతయు తలిదండ్రులదనియే చెప్పవలసివచ్చును. కావున బాల్యావస్థయందు పిల్లలతగురీతిని బెంచుట తలిదండ్రులవిధి.

బాలురు పాఠశాలకువెళ్ళి విద్యనేర్చుకొనవలసిన తరుణమువచ్చినప్పుడు వారినడవడి చక్కజేయవలసినబాధ్యత తలిదండ్రులయందు క్రమముగాతగ్గును. అట్టిబాలురనడవడినిగురించిన

బాధ్యత ఉపాధ్యాయునిపై గొంతపడును. బాలురకును చి
నడత పట్టుపడవలెనన్నచో తలిదండ్రులును ఉపాధ్యాయుడును
కూడ మంచినడతగలవారుగనుండవలెను. శీలవంతుడును వి
ద్యావంతుడునై వినయవిధేయతలుగలిగియున్న, ఉపాధ్యాయుని
యెడ విద్యార్థుల కెక్కువగౌరవముండును. అందుచే నట్టివాని
యెడ బాలురు మిక్కిలివిధేయతతో మెలగుచుందురు. తానెవరి
యెడ నెట్లువిధేయతతో మెలగవలెనో తెలిసికొనజాలని ఉపాధ్యా
యుడు తనశిష్యులకేమాత్రమును విధేయతగరపజాలడు.

ఇక పెద్దవారై లోకవ్యవహారములలో ప్రవేశించునంత
టి వయస్సువచ్చినప్పుడు మానవుల విధేయతఅవిధేయతలు మరి
యొకతీరుగనుండును. పెద్దవారై నలుగురిలో తిరుగనేర్చినకొల
దిని మనుష్యులు తమవిధేయతను సమయానుకూలముగ మార్చు
కొనుచుండవలెను. ఎట్టి సందర్భమునందైనను ఆత్మగౌరవమున
కుమాత్రము లోపములేకుండ ప్రవర్తించుచుండవలెను. ఆత్మ
గౌరవపోషణమొనర్చుకొనుచు ఇతరులయెడ నమ్రభావమున
మెలగుటయే నిజమైనవిధేయతకులక్షణము. తనమనముకిదియే
మంచిమార్గమని రూఢిగదోచినప్పటికిని పెద్దవారలు చెప్పుచ
న్నారుగదా యని వేరువిధమున ప్రవర్తించుట విధేయత అన
పించుకొనదు. మహాత్ముడగు ప్రహ్లాదుడు పసితనముచే తెలియ
క తండ్రియెడ అవిధేయతజూపెనని ఆతనినెవ్వరును నిందింపరు

కాని సంఘాభివృద్ధికిని, దేశాభివృద్ధికినిగాను పలువురి
తో పాటుబడవలసి వచ్చినప్పుడు కొన్నివేళల మానవులెక్కువ
విధేయత కనుపరచవలసివచ్చును. నలుగురునుగలసి తమఅంద

రిలో గొప్పవాడగువానిని నాయకునిగ నేర్పరచుకొనినపుడు ఆతనిమాట నేమాత్రమును జవదాటకుండుటవల్లనే వారేపని నైనను నెరవేర్పగలుగుదురు. అట్టిముఖ్యునికంటెను సామాన్య మానవులకే ఏదియో నొకవిషయమున నెట్లుప్రవర్తింపవలసినది యును బాగుగ తెలిసియుండవచ్చును. ఇందిట్లుప్రవర్తింపవలయు నని తమనాయకునికిచెప్పి యొప్పించినమంచిదే. అట్లుఒప్పింపలేన ప్పుడు ఆతనియాజ్ఞను శిరసావహించి ప్రవర్తించుటయే వారి కార్యసాధన కనుకూలముగనుండును. అంతియకాని మంచిదైన ను ప్రతివాడును తమఅభిప్రాయానుసారముగనే ప్రవర్తింపనెం చినచో వారేమాత్రమును తమయుద్దేశముల నెరవేర్పజాలకపో వుటయేకాక తమసంఘమునకును, దేశమునకునుగూడ కష్టముల నాపాదింతురు. కావున నిట్టిసందర్భములలో ఊరకవిధేయతకను పరచుచుండుటయే మిక్కిలిశ్రేయోదాయకము.

నాయకునియెడల ఎట్లువిధేయతకలిగి యుండవలయునో యుద్ధసమయములందు బాగుగ నేర్చుకొనవచ్చును. ఆతడు చెప్పి నట్లెల్ల సైనికులుచేసియేతీరవలయును. పైవారుసయితము కొ న్నిసమయములలో తప్పుదారినిపోవచ్చును. సైనికులలో నెవ్వ రైన దానిని తెల్సికొని తమనాయకునికి తెలిపినచో నాతడువిన వచ్చును. వినకపోవచ్చును విననిచో కోపముచే నాతనిపైకల హించుట యెన్నటికినితగదు. అట్లైన సర్వమును చెడిపోవును.

కావున నాయకునిఅభిప్రాయమునే తమయభిప్రాయముగ తీసి కొని భటులందరునొక్కటిగ ఆయనయాజానుసారులై వర్తింప సిద్ధముగనుండవలెను.

పైఉద్యోగస్థులయెడ అనవసరముగ నెక్కువవిధేయత కనుపరచుచుండుట కొందరికిసహజలక్షణము. పనిలేకపోయినను అనేకమారులు వారియిండ్లకుబోయి, అచ్చటయూడిగముల జేయుచు ఇతరులపై కొండెముల జెప్పి, వారిఅనుకూలతకు పాత్రులుకానెంచెడు ఉద్యోగస్థులనెందరినో మనము నిత్యమునుజూచుచునేయున్నాము. అట్టివారికి ఆత్మగౌరవమనుమాటయేయుండదు. ఉద్యోగాభివృద్ధికై పయివారినాశ్రయించి సేవచేయుటయే కాని వారేమాత్రమును కావలసినవిధేయత కలిగియుండలేదని మనమనుకొనవచ్చును.

ప్రతిసంఘమునందును, ప్రతిదేశమునందును, అందలిప్రజలయొక్క క్షేమమునకై కొన్నిచట్టములేర్పరుపబడియుండును. విద్యావంతమైనాగరికతనొందిన సంఘములందును, దేశములందును, ఇట్టిసామాన్యచట్టములన్నితరగతుల ప్రజలయొక్కయు ప్రతినిధులచే నేర్పరుపబడియుండును. అందుచే నట్టివానికి లోబడియుండుట ప్రతివానికిని విధియగుచున్నది. కాని ప్రజాప్రతినిధిపరిపాలనము లేనికొన్ని రాష్ట్రములలో సర్వాధికారులుగనుండు రాజులు తమంతటతాముగాని, మరికొందరిసలహాలవలనగాని జనబాహుళ్యమున కనుకూలముగనుండని కొన్నినిబంధనల నేర్పరచుట తటస్థింపవచ్చును. అట్టియెడ నాచట్టములకందరును లోబడినడచుకొనవలెననుట అంతన్యాయముగ కనుపట్టదు. తమ కష్టములను వెల్లడించుటకై దేశములోనిప్రజలు మానసికస్వేచ్ఛకలిగి యుండనెంచినచో అట్టివారు చట్టములకవిధేయులై నడచుచున్నారని చెప్పుటెంతయు సాహసము.

మన దేశములో ననేకులకు సామాన్యముగా గొప్పవారని పించుకొనువారలకు సయితము విధేయతయన నేమియో, ఎట్టి సమయములయందు విధేయతగలిగియుండవలయునో తెలియదు. కొందరు గొప్పవారుగూడ విధేయతగలిగియుండవలెనను అభిప్రాయముతో మానసికస్వేచ్ఛను గోల్పోవుచున్నారు. ఏగౌరవబిరుదములనందిన వారలనో మోసపుచ్చి వారిచే మంచివారనిపించుకొనిన తుంటరులను పలుమారు ఇతరులును మంచివారుగనే యెన్నుచుందురు. ఆతుంటరులకు మంచిదేయైనను, లోకమునకు మాత్రముఅట్లుచెప్పుట అనర్థమనియే చెప్పవలసియున్నది. నాగరికతచెందిన ఇతరదేశములలోవలె మంచిచెడ్డల యథాశక్తిగ నిర్ణయించుకొని కారణయుక్తమగు అభిప్రాయము నేర్పరచుకొనశక్తి మనదేశములో కానుపించదు. నవీనకాలమున నీహిందూదేశమునందంతటను ప్రసిద్ధికెక్కిన మహాకవియగు రవీంద్రనాథఠాకూరుసయితము ఇంగ్లీషువారిమన్ననలనందినమీదటనే మనవారిచే గొప్పవాడనిపించుకొనియెను. ఇట్లే మనవారిలో ననేకులు మంచివారనిపించుకొనుటకై తమ మనమున కెంతకారణయుక్తముగ లేదనితోచినను నలుగురు పెద్దలతో బాటేదియో యొకమతము నవలంబింతురు. కాని మతవిషయములలో నెవ్వరేయభిప్రాయముగలిగియుండినను, అన్యమతసహనముండిన జాలునుగదా, ఏల మానసికస్వేచ్ఛను గోలుపోవలెననితలంచరు. అన్యమతసహనముగలిగియుండి, ఇట్టి విషయములలో విధేయత అక్కఱలేదనియే మనమునొక్కిచెప్పవచ్చును. అన్యమతసహనము లేకుండిన, సంఘములును, రాజ్యములునుగూడనశించును. ఆనిబంధన జనులందరికిని సం

బంధించినది. దానిమాత్రమెవ్వరును ఉల్లంఘించగూడదు. అచ టవి ధేయత యేతగును. ఏమాత్రమును మానసిక స్వేచ్ఛకూడదు. కనుక సామాన్యముగ పదుగురకుసంబంధించిన విషయములలో విధేయతయెక్కువగ నుండవలెననియు, ఒకనికిమాత్రమే సంబంధించినవానిలో మాత్రమంతగ విధేయత ఉండనగత్యములేదనియు తేలుచున్నది.

జనసామాన్యమునకై చట్టములనేర్పరచువారు మును ముందుతామే ఆచట్టములకు విధేయులైచరింపవలెను. నిబంధనలనేర్పరచిన పెద్దవారే వానినుల్లంఘించినచో, ఇకసామాన్య మానవులెట్లు వానిననుసరింపగలరు? దేశములో ప్రతివారును తమబాలికలకు విద్యనేర్పించవలెనను శాసనమునేర్పరచిన ప్రభువేతనపుత్రికలను పాఠశాలకుబంపవెనుదీసినచో నితరులా చట్టములకు విధేయులు కాకుండుట సహజము. కావున ఇట్లాచరింపుడని ఇతరులకు చెప్పుటకు పూర్వము ప్రతివాడును తాన ట్లాచరించియుండవలయును విధేయతను బోధించుటకిదియే ముఖ్యసాధనము.

ఇంగ్లాండుదేశమునకు ముఖ్యపట్టణమగు లండనునగరములో పోలీసు ఉద్యోగస్థులవిషయమీసందర్భములో మన ముదాహరణముగ దీసికొనవచ్చును. ఆదేశమునందలి ప్రజలందరునుగలసి తమప్రతినిధి సంఘముద్వారా రాజుగారిచే కొన్ని చట్టములనేర్పాటుచేయించుకొనిరి. అందువలన ఆదేశమునందలి యేయేఉద్యోగస్థులకు ఏయేఅధికారము లుండవలసినదియును వారికనుకూలముగనే నిర్ణయింపబడినదని మనమనుకొనవచ్చును.

విద్యావంతులగు నాదేశప్రజలందరికిని ఇట్లేర్పరుపబడిన ఉద్యోగస్థులకు విధేయులై ప్రవర్తించుట తమవిధియని తెలియును. కావుననె అతిస్వల్పజీతమునకు పనిజేయు పోలీసుఉద్యోగస్థులకుసయితము వారతివిధేయులై వర్తింతురు. విద్యావంతులగుటచేత నచటిఉద్యోగస్థులందరును తాము ప్రజాక్షేమమునకై యేర్పరుపబడిన వారేయనియెరిగి, తమయధికారమునకు తగినట్లుగ నడచుకొనుచుందురు. తమకంటెను మిక్కిలిఉన్నత పదవులలోనుండువారైనను చట్టముల నతిక్రమించినచో, ఆపోలీసువారు నిర్భయముగ వారిపైచర్యజరుపుచుందురు.

## ప్రకటన.

ప్రచురింపబడినవి—1 జనసామాన్యముయొక్క విద్య 2 అంత్యజులు 3 కలరా 4 సత్యసంధత 5 ఋజువర్తనము 6,7 ఆత్మగౌరవము 8 కాలముయొక్క విలువ 9 విధేయత

ప్రచురింపబడునవి — 1 పట్టుదల 2 స్వయంసహాయము 3 స్వార్థత్యాగము

విశేషములు: గుంటుపల్లి సుబ్బారాయుడు,
రైలుపేట, గుంటూరు.
అనివ్రాసిన దెలియగలవు.

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందుముద్రితము.

గీ॥ "ఉద్ధరించెదదేశ మేనొక్క-రుండనె ।నిశ్చయంబిది సేయంగ నేరఁడొరుఁడు"
అనుచు"విలియముపి"ట్టనునతఁడువలికె।అట్లెయెల్లరుదలపఁగనగునుశుభము॥

# గ్రంథపఠనము.

ఈలోకములో నెట్టిమానవునికైన కాలమెల్ల వేళలనొక్క-
టిగనుండదు. కొన్ని సమయములందు ఆనందాంబుధి నోలలాడు
మనుజుడే మరికొన్ని వేళల మీరరానికష్టములపాలై దుఃఖసము
ద్రమున మునిగియుండవలసివచ్చును. సంతోషముతోనుండు
కాలమెంతయైనను లెక్కకురాదు కాని, కష్టసమయములందు
నిముషములైనను ఏండ్లుగదోచుచుండును. దుఃఖములపాలై
నప్పుడెట్టివానికైనను ధైర్యము చెడుట సహజము. అట్టివేళల
మిత్రులుండిన ధైర్యము చెప్పి దుఃఖము నాపజూతురు. కాని,
అట్టిస్నేహితులు సమయమునకు దగ్గరనుండుట తటస్థించవలెను.
నీతిదాయకములును, సుబోధకములునగు గ్రంథములు సులభ
ముగదొరుకును. అట్టిగ్రంథముల దుఃఖసమయములందు పఠిం
చిన ధైర్యమునిచ్చి, సంతోషమునుగలిగించును. గ్రంథములలో
పెక్కుమంది మహనీయులు ఎన్నియో కష్టములకోర్చి ధైర్య
మే ప్రధానముగగలిగి చివరకు సౌఖ్యములబడసిరని మనకు దెలి
యును. నీతిబోధకములగు అటువంటికథలనుజదివిన ఎంతటి
విపత్తులోనుండినను మానవునికి ధైర్యమును, ఎన్నికష్టములొంది
నను ఇంకను సౌఖ్యములనొందగలమను ఆశయుకలుగుననుటకు
సందియము లేదు. మనవారిలో ననేకులు తమబంధువులకుగాని,
మిత్రులకుగాని ఆపదలువచ్చునప్పుడుదరిజేరి "పూర్వము

ఋష్యాదులుసయితము కష్టములనొందిరి. ఇకమనమా? రానున్న కష్టములు రాకమానవు. ధైర్యముచే నెన్నిపనులనైన సాధింప వచ్చును. చూడుడు! పాండవులు భార్యాసహితులై పదుమూడేండ్లు ఇడుములపాలైనను చివరకు సౌఖ్యములనొందిరి." అని చెప్పి వారిదుఃఖము నాపజూతురు. అట్లితరులు చెప్పుటకుమారు తమ రేఆసీతికథలను జదువుకొనిన, వెంటనేదుఃఖమునుమాని వైతురు. కావున, కష్టసమయములందు స్నేహితులకంటెగూడ గ్రంథములే ఎక్కువఉపయోగ కరములని చెప్పవలెను.

పుస్తకములు చదివినకొలదిని యెట్టివానికైనను తెలివి కలుగకమానదు. ఎల్లప్పుడేదియో గ్రంథములజూచుచుండుటచే మూర్ఖులుసయితము మిక్కిలి తెలివితేటలుగలవారుకావచ్చును. మొట్టమొదట తిన్నగా నాలుగువాక్యముల సమకూర్పలేనివారై యును అనుదినమును గ్రంథములజదువుచుండుటచే కొంతకాలమైన వెనుక చక్కనిశైలితో గ్రంథములవ్రాసియు, గొప్పగొప్ప సభలలో ఉపన్యాసములిచ్చియు పేరుగాంచినవారనేకులుగలరు. కావున పుస్తకములు విస్తరించిచదువుటచే భాషాజ్ఞానముకలుగునని తేలుచున్నది.

చరిత్రలు చదివిన పూర్వకాలమున ఎప్పుడేదేశములో జనులెట్లులుండిరో తెలిసికొనవచ్చును. పుస్తకములే లేకయుండిన గ్రీసు, ఇటలీ మున్నగుదేశములెట్టియున్నతస్థితియందుండునో, ఆయాదేశములనట్టి గౌరవపదమునకు దీసికొనవచ్చిన మహాపురుషులెవ్వరో ఇప్పటివారికి ఏమియు తెలిసియుండకపోవును. అంతియుకాక, తమదేశచరిత్రమును చదువుకొనుచుండినప్పుడు ప్రతి

వానికిని పూర్వము తమదేశ మేస్థితిలోనుండెనో తెలిసికొనవీలుండును. అప్పుడే, తమయొక్క స్థితిని తమపూర్వులస్థితితో బోల్చుకొనగలిగి, తమపూర్వులకంటె తామెక్కుడుస్థితిలోనుండిన సంతోషించుటకును, హీనస్థితియందుండిన దుఃఖించి బాగుపడ ప్రయత్నించుటకునువీలుండును. ఇట్లేగణితము, తర్కము, శాస్త్రము మొదలగువిషయముల బోధించుగ్రంథముల చదువుచువచ్చిన ఆయాశాఖలలో ప్రావీణ్యత చిక్కుననుటకు సందియముండదు.

మిక్కిలి తెలివిగలవారుసయితము కొన్ని సమయములందు ఏమార్గమునబోయిన ఉత్తమమో తెలిసికొనజాలక పలుమారుతప్పుదారులవెళ్ళి విఫలమనోరథులగుచుందురు. స్నేహితులుండిననట్టిసమయములయందు సలహాలనిచ్చి వారికితోడుపడవచ్చును. కాని,అట్టిసందర్భములలో స్నేహితులకంటెను పుస్తకములు ఎక్కువ సహాయకారులుగ నుండునని చెప్పవలెను. పుస్తకములలో ఆటువంటిసందర్భములయందే యితరులెట్లు ప్రవర్తించిరో, వారిజయమునకు కారణములెవ్వియో సులభముగ దెలిసికొనవచ్చును అదేవిధముగ నడచుకొనిన మనముమాత్రమేల జయమునొందకూడదనెడు ధైర్యముకలుగును. కావున, ఏదియే నొక విషయమునందు మానవుని కేమియుతోచని వేళలలో పుస్తకములు సలహానిచ్చుచుండును

గ్రంథపఠనములేకయే విషమసమయములందు సయితము తెలివితో సంచరించగల బుద్ధిశాలురుకూడ ననేకులుండవచ్చును. అట్టివారికిక గ్రంథపఠనము అనవసరమని చెప్పుటమాత్రము యుక్తియుక్తముకాదు. మొక్కపుట్టినప్పుడు దానినెట్లుకత్తి

ఉంచి ఏవిధముగ పెంచిన బాగుండునో కనుగొని, అట్లుచేసినగాని వృక్షమగునప్పుడుచూచుటకింపుగానుండదు. అదేవిధమున, స్వాభావికముగ తెలివిగలవారైనను, పుస్తకాపఠనములేనిది వారి తెలివి వన్నెకెక్కనేరదు. గ్రంథములుచదువుటవలన మానవుని కీ యుక్తాయుక్తవివేచనాజ్ఞానముకలుగును. మంచిచెడ్డలనెరుగ గలిగినప్పుడే ఆతని తెలివి యెట్టిసమయము లందుపయోగింపవ వయునో, ఎట్టిసమయములందు ఉపయోగింపరాదో తెలియనగు ను. అవసరమగుచోటున ఉపయోగించిన తెలివియే తెలివియన బడును. గ్రంథపఠనమువలన, తెలివిహీనులు తెలివిగలవారైన ట్లు తెలివిగలవారును వారి తెలివిని ఇంకనువృద్ధిచేసికొనవచ్చు ను. కావున ఎల్లవారును పుస్తకములు చదువుటముఖ్యము.

పుస్తకములు చదువునప్పుడు నీతినిబోధించు విషయము లనేకములువచ్చును. చదువురాని మూఢులునయితము గ్రంథ కాలక్షేపముజరుగుచుండినపుడు అతిశ్రద్ధతో వినుచుందురు. అట్లు వినుటచే గొందరు నీతివంతులుకావచ్చును. కాని, వారందరును చదువునేర్చినవారై నీతిబోధకములగు ఆపుస్తకములను తామే యెల్లప్పుడును చదువుచుండిన, ఒకప్పుడుకాకుండిన మరియొక ప్పుడైనను తాముకూడ నట్లే నీతివంతులై కీర్తినొందవలెననెడు నిశ్చయముకలుగకమానదు. నిశ్చయమేకలిగిన కార్యాచరణ మతిశీఘ్రముగనగును. హరిశ్చంద్రుని చరిత్రమునుజదివి సత్యము ను బలుకప్రయత్నింపనివారును, శ్రీరామునికథనువిని తలిదండ్రు లయెడ విధేయులై యుండనెంచనివారును మిక్కిలిఅరుదు.

చీకటిలోనివస్తువుల బయలుపరచు వెలుతురే కొన్నిస

మయములందు కీనీడచే మఱికొన్ని వస్తువుల మఱుగుపరచును.
అట్లే గ్రంథములు సామాన్యముగ మానవుని ప్రవర్తనచక్క
జేయుటకు తోడుపడునవైనను, వానిలో దుర్నీతులబోధించునవి
కూడ లేకపోలేదు. అంతమాత్రమున గ్రంథపఠనమే మానివే
యవలెననుటమంచిదికాదు. హంస నీటినుండి పాలనువేరుపరచున
ట్లు బుద్ధిమంతులైనవారు సుబోధకములును, నీతిదాయకములు
నగు గ్రంథములనేగ్రహించి వానినేపఠించుచుండవలెను.

గ్రంథములనుజదివి వానిలోనిసంగతులను గ్రహించుట
యే మానవునియొక్క తెలివితేటలు వృద్ధిజేసుకొనుటకు ముఖ్య
సాధనమని చెప్పియుంటిమి. అంతమాత్రమున మనముచదివెడుపు
స్తకములలో గనబడు ప్రతివిషయమును దీసికొనవలెనని మా
అభిప్రాయముకాదు. అనేకపుస్తకములుచదువవచ్చును; పెక్కు
విషయములు కనుగొనవచ్చును. కాని, ఏవిషయములుగ్రహిం
పదగునో, ఏవిగ్రహింపతగవో సమయానుకూలముగ నిశ్చయిం
చుకొనవలెను. మంచివిషయములనే గ్రహించి చెడువానినివద
లివేయుచుండవలెను. అట్లుచేయుటకు అనుభవములేనిది సాధ్య
ముకాదు. ఇదిమంచిదిది చెడ్డదని అనుభవముచేతనే నిర్ణయింప
నగును కావున, స్వభావజనితమైన తెలివిని వృద్ధిజేసికొనుటకు
సద్గ్రంథపఠన మెట్లవసరమో, పుస్తకములలోని మంచిచెడుగు
ల వేరుపరచుటకు అనుభవమును అట్లేయవసరమగుచున్నది.

పుస్తకములు చదువునప్పుడు సాధారణముగ వానిలోని
విషయములు సకారణముగనున్నవా లేవా యనిచూచెదము.
కారణయుక్తముగనున్న విషయములనేగ్రహించి, కారణరహిత

ముగనున్న వానినివదలుచుండుము. ప్రతివిషయము నిట్లుపరీ శీలించుటచే మనలో కారణముల గనుగొనుశక్తి వృద్ధియగును. అప్పుడు ప్రపంచములో మనచుట్టునుండు పెక్కువస్తువుల యొక్క ఉనికినిగూర్చి మనంతటమనము ఆలోచించి యేదియే నొకనిశ్చితాభిప్రాయమును ఏర్పరచుకొనగలుగుదుము. కావున ప్రపంచమునందలి విషయములను బాగుగపరీక్షించుటకు మానవునికి పుస్తకములు మిక్కిలిసహాయకారులని చెప్పవచ్చును.

ఏగ్రంథములనైనను నిర్మలమును నిష్పక్షపాతమునగు బుద్ధితో జదువనారంభించవలెను. ఒకానొకపుస్తకములోని విషయములనెల్ల ఖండించవలెనని గాని, లేక దానిలోనుండున దెల్ల వేదవాక్యములుగ శిరసావహింపవలెనని గాని తలంచరాదు. పచ్చనిసులోచనములు పెట్టుకొనినవానికి చూచునదంతయు పచ్చగనేయుండునట్లు, ఖండించుటయే ముఖ్యోద్దేశముగగలవానికి పుస్తకములో నెట్టిసువిషయములుండినను అన్నియు లోపములుగనే కనుపించును. లేక, భూషించియే తీరవలెననుకొనువానికి మన్నింపరాని దోషములుండినను, వానినిజస్వభావము తెలియకుండును. సామాన్యముగ చదువరులకును గ్రంథకర్తలకునుగల పరిచితియే దీనికికారణమనిచెప్పవచ్చును. నిజముగనొకగ్రంథములోని లోపాలోపములను పరిశీలించనెంచువాడు, గ్రంథకర్తయెవరైనదియు, తనకాయనయెడగల గౌరవమెట్టిదైనదియువిచారించకుండవలెను. ఏపుస్తకము చదివినను దానిలోని విషయములనెల్ల చక్కగపరిశీలించి మంచిచెడుగుల విడదీసి, తనశక్తిక్రమించినచోట తనకంటె తెలిసినవారి సలహాలనుతీసికొ

ని, పిమ్మట ఆపుస్తకమునుగురించి తనయభిప్రాయము నేర్పరచుకొనవలెను. కాని పరులయభిప్రాయమునే అనుసరించిపోవు వారియభిప్రాయముల ఇతరులు ప్రమాణములుగ గ్రహింపరాదు.

ప్రతివాడును తనకు తెలిసినపుస్తకములన్నిటిని జదువుటకువీలుండదు. అట్లుచదువుటయు యోగ్యముకాదు. ఇతరులయొక్క సహాయమువలనకాని తానుస్వయముగ ఆలోచించిగాని తనకు మిక్కిలిఉపయోగములగనుండు పుస్తకములనే చదువుట ప్రయోజనము. అట్లువేరుపరచిన పుస్తకములలోసయితము అక్కడక్కడ అనవసరములగు భాగములుకొన్నియుండవచ్చును. యుక్తాయుక్తముల నెరుగగలవాడు వానినెల్లచదువుచు కాలమును వృధపుచ్చడు. అంతియకాక, విద్యలో ఒకానొకశాఖయందభిరుచికలవాడు, ఆశాఖలోతనయభివృద్ధికితోడుపడుపుస్తకములనే చదువుటమంచిది. గణితమునందెక్కువరుచిగలవాడు చరిత్రలుచదువుచుండిన తానాకడపటిశాఖలో సంపాదింపగలుగువిద్య స్వల్పమగుటయేకాక, తనకభిరుచిగలశాఖలోనుండు విద్యకూడ క్షీణించిపోవును. పాఠశాలలో బాలురకు విద్యగరపునపుడీవిషయమును ముఖ్యముగ గమనింపవలెను. ఏబాలునికి ఏశాఖలో నెక్కువరుచిగలదో తెలిసికొని, ఆశాఖయందే వానికెక్కువ పరిశ్రమయుండనట్లుచేయవలెను.

సామాన్యమానవులు మాత్రము తమకెక్కువగ ప్రపంచజ్ఞానమునిచ్చు పుస్తకములనే జదువుచుండుట మంచిది. వారికన్నివిషయములందును కొంచెమోగొప్పయో జ్ఞానముండుట

అవసరముగుటచే, వారికనుకూలమగు గ్రంథములనే జూచు చుండవలెను.

గ్రంథపఠనము కాలమునుబట్టికూడ మారుచుండును. దుఃఖసమయములందు సంతోషమునుకలిగించి ధైర్యమునొసగు పుస్తకములనే చదువవలెను. మనోవ్యథను కలుగజేయుపుస్తకములనట్టిసమయములందు తలువనైనతలువరాదు. మనస్సునెక్కువపనిచేసియుండినప్పుడు, ఆబడలికనుతీర్చునట్లు హాస్యరసముగలపుస్తకములుతప్ప మనస్సునకుశ్రమనిచ్చెడు పుస్తకములనుచదివి మరింతబాధకలుగజేసికొనుట యుక్తముకాదు.

పుస్తకములెట్టివైనను, చెడగొట్టక జాగ్రతగకాపాడుట యెల్లవారికినివిధియైయున్నది. పుస్తకములు గ్రంథకర్తయొక్క మనోసామర్థ్యములగనబరచును. అట్టియెడ గ్రంథకర్త మృతి నొందినను ఆయన గ్రంథములుమాత్రము చెడకుండనుంచిన, ఆయనయొక్క శక్తితరతరములవరకును తెలియుచుండును. అంతియకాక కాలమెల్లప్పుడు నొక్కటిగనుండదు. కాలముతోపాటు ప్రజలయొక్కరుచులుకూడ మారుచుండును. అందుచే ఒకానొకకాలమునకు పనికిరాదని వ్రాసినపుస్తకములుసయితము మరియొకకాలమునకు మిక్కిలిఉపయోగకరములుగ నుండవచ్చును. కావున పుస్తకములాకాలమునకు పనికిరాకుండినను, వాని నంతతో అంతమొందింపక శ్రద్ధతో దాచియుంచవలెను.

విశేషములు: గుంటుపల్లి సుబ్బారాయుడు,
రైలుపేట, గుంటూరు
అనివ్రాసిన దెలియగలవు

---

గుంటూరు వాణీముద్రాక్షరశాలయందుముద్రితము.

గీ॥ "ఉద్ధరించెదదేశ మేనొక్కరుఁడనె । నిశ్చయంబిదిసేయంగ నేరఁడొరుఁడు"
అనుచు "విలియముపి"ట్టనునతఁడువలికె। అట్లెయెల్లరుదలఁపఁగనగునుశుభము॥

# పట్టుదల.

గీ॥ తనిసిరే వేల్పు లుదధిరత్నముల చేత । వెరచిరే ఘోరకాకోలవిషముచేత
విడచిరే యత్నమమృతంబు వొడముదనుక। నిశ్చితార్థంబువిడువరునిపుణమతులు॥

పట్టుదలలేని దేపనియును నెరవేరదు. కార్యసాధనమునకు ప్రారంభించుట ఎంతావశ్యకమో, కడతేరువరకును పట్టుదలతో పనిచేయుచుండుటయు నంతయావశ్యకమే. తుదవరకు నెగ్గిననే కాని, ప్రారంభింపబడినంతనే యెట్టి ఘనకార్యమైనను ప్రయోజనకారి కాజాలదు. గొప్పవిషయములసాధించుటయందు విశేషకాలమువరకును, స్వల్పవిషయములందు కొలదికాలమువరకును పట్టుదల కావలసియుండును. కాని మొత్తముమీద మొదలిడిన కార్యము తుదముట్టవలెనన్న ప్రతిపనియందును పట్టుదల యుండియే తీరవలెను.

మానవుని కెప్పుడును కాలమొకేతీరున గడిచిపోవదు. కొన్ని వేళల సమితోత్సాహకరముగనుండును. మరికొన్ని సమయములం దటులుండక నిరుత్సాహకరముగనుండును. ఉత్సాహపూరితులుగనుండు సమయములలో నేవేవియోపనులొనర్ప వలయునని మానవులందరికిని యూహలు జనించుచుండును. అట్టితరుణములందే అనేకఘనకార్యములు ప్రారంభింపబడును. కాని తక్కిన సమయములలో తగినంతయుత్సాహము లేకయు, మొదలిడినకార్యముల సాధించుటయందెదుర్కొనవలసివచ్చు

ఆటంకములకు జంకియు, మానవులు మఱల వానికొఱకంత ప్రయత్నింపజాలకుందురు. అప్పు డాపనులంతటితో నాగిపో వును. పట్టుదలగలవారట్లూరకొనక ఎన్ని యాటంకములు వచ్చినను, ఎంతనిరుత్సాహకరముగ నుండినను మనోనిబ్బరము ను గోల్పోవక యథాశక్తిని కార్యసాధనకై ప్రయత్నము లొనరించి, తమ కసాధ్యమగు-చోటుల నితరుల సహాయముచేనైన మొదలిడిన కార్యమును ముగించువరకును నిదురపోవరు. అప్పుడే ఆ పనియొక్క ఫలితము ననుభవించుటకు వీలుండును.

ఈ విధముగ నెల్లపుడును తమ పట్టుదలను వదలక తల పెట్టినకార్యము లెన్నికష్టములకైననోర్చి నెరవేర్పగలవా రతి స్వల్పసంఖ్యాకులు మాత్రముందురు. మాటిమాటికిని అనేక పనులొనర్పవలయునని వానినన్నిటిని ప్రారంభించి, దేనినిగాని సాంతముగ నొనర్పకయే, చివర కన్నిటిని మానుకొనువారెంద రుండినను ప్రయోజనము లేదు. పట్టుదలయు, పూనికయు, లేని ఆరంభశూరత్వముండియు ప్రయోజనకారికానేరదు. చిర కాలమాలసించియైనను బాగుగ నాలోచించి ప్రారంభించిన యొకపనినేనియు తుదవరకును పట్టుదలతో సాధింపగలవారలే ధీమంతులు. అట్టివారే తమకును సంఘమునకునుగూడ లాభ కారులు. వారివలననే లోకమునకు మేలుకలుగును.

సలసల మరుగుచుండిన నీటికుండపై నెగిరెగిరిపడుచుం డిన మూతను కనుగొని, ఆహా! నీటియావిరికెంతటి సామర్థ్య ముకలదని యాశ్చర్యపడిన మహాత్ము డంతటితోనూరకుండిన చో మన కీ ఆవిరియంత్రములన్నియు నుండునవికావు. ఎంత

యో ధనవ్యయముతో నెన్నియో కష్టములకోర్చి యొకచిన్ని యంత్రమువలన నీటియావిరిచే పనిచేయింపవచ్చునని యాతడు కనుగొనినది పట్టుదలచేతనే. అంతటితో నూరకుండినను మన గతి యధోగతియయ్యెడిదే. కాని యింకను కష్టములకోర్చి మహాప్రయత్నములొనర్చి ఆ నీటియావిరిచేతనే వేలకువేలు టన్నులబరువు నవలీలగ, గంటలతరబడి విసుకువిరామము లేక అతిత్వరితగతినీడ్వగల యీ మన యింజనులను గనుగొనిన మహాత్ములపట్టుదల నేమనికొనియాడవచ్చును? పరీక్షలు సమీపించుతరి సాంతముగ ననేకమారులు ముగింపనెంచిన పుస్తకముల నావలిప్రక్క బడవైచికొని నిదురబోవు విద్యార్థుల నిక నిట్టివారలముం దేమని వక్కాణింపనగును?

ఏదయిననొక పనిని జేయవలసివచ్చినప్పుడు పలుమారు మానవులు తమకది యసాధ్యమనియు, అందరాని మ్రానిపండ్లకై అఱ్ఱులుసాచిన పరిహాసపాత్రులమగుదుమనియు, ఆపనిని మొదలుపెట్టకయే వదలుచుందురు. మీదుమిక్కిలి దానికై ప్రయత్నించువారలను గూడ నిరుత్సాహులను జేయుచుందురు. కాని, ధీరులగువారు వారిమాటల లెక్కింపక అసాధ్యమను మాట సోమరులయెడ వర్తించునుగాని తమయెడల కాదని, కార్యారంభముచేసి, దానికై వలయు ప్రయత్నములగావింతురు. మరియు, ఏపనినిగాని ప్రయత్నించుటకు పూర్వమే యసాధ్యమని చెప్పుటకు వీలులేదు. సాధింపరానివనితోచు కార్యములు సయితము ప్రయత్నముమీద సాధ్యములు కావచ్చును. కావున, ఏపనినైన అసాధ్యమని ముందుగ వదలరాదు.

పసితనమున మనకందరికి నెన్నెన్నియో కోరికలు జనించుచుండును. ఏవేవియో సత్కార్యములనొనర్చి కీర్తివంతుడను కావలయుననియే ప్రతిబాలుడును కోరుచుండును. విద్యార్థులుగ నుండువారందరికిని తాము కలెక్టరులై జనులకు జాగీరుల నొసగి మంచివారనిపించుకొనవలెననియే యపేక్ష. గొడ్లగాయు బాలురందరికిని తాము మంచి పంటకాపులై ధనధాన్యముల బీద బ్రాహ్మణులకు దానము లొనర్పవలయునను యభిలాష యే మెండు. కాని ఇవియన్నియు అందరికిని సాధ్యములుకావు. పదార్థవిజ్ఞానశాస్త్రము నెక్కింత నేర్చిన వారందరును శాస్త్రజ్ఞులై క్రొత్తవిషయములను గనుగొనజాలరు. పద్దెములల్లగలవారందరును కవీశ్వరులు గాజాలరు. ఐతేఎవ్వని కెట్టిశక్తి కలదో, ఎవ్వడేకార్యమును సాధింపగలడోయను విషయ మూరక నిర్ధారణచేయ నలవికాదు. ప్రతివాడును తనశక్తి కొలదిని పట్టుదలతో పనిచేయవలయును. అప్పుడే ప్రతివానియొక్క నిజమగు ఘనతయు నగుపడును. ఒకపరి యొకవిషయమును, మరియొకసారింకొకవిషయమునాలోచించుచు, అనేకపనుల నెగుడు దిగుడుగ జేయువాడెంతటి బుద్ధిశాలియైనను వాని శక్తి లోకమునకు తెలియదు. అట్టివారివలన లాభమును లేదు.

పనిచేయువారలలో ఉత్సాహము లేని దేపనియును కొనసాగదు. మానవులు యౌవనులుగనుండునప్పుడే వారికి యుత్సాహము మెండుగనుండును. కావున, ఏపనినిగాని మానవులు యౌవనావస్థయందు బాగుగనాలోచించి మొదలిడవలయును. అట్లు ప్రారంభించిన కార్యముల నావల తప్పక నెరవే

ర్చుచుండవలెను. వయస్సు వచ్చినకాలదిని సంసారభారము పయిబడినదికడా మనమింకేమి యొనర్పగలమని తమ పట్టుదలను వీడి చివరకాపనులను ముగింపజాలకుండిన ప్రయోజనము లేదు. దేశదేశములును దిరిగి వసూలుచేసిన చందాలతో గుడిగోపురములు కట్టించినమీదట, విసువుచే విగ్రహమును ప్రతిష్ఠించుట మానుకొనినవారి కేమాత్రమైనను మనశ్శాంతి కుదురజాలదు. చుట్టుప్రక్కలనుండు గ్రామాదులలో పుస్తకభాండాగారములున్నవి. మన యూరగూడనట్టి దొకటియుండిన బాగుండునని స్థాపించిన మహాత్ములు వానిని బాగుగ ప్రతిసంవత్సరమును వృద్ధిచేయుచు, ఉపయోగించుకొనుచుండిననే లాభకరముగనుండునుగాని, క్రొత్త యుత్సాహమణగినతోడనే వానిదరిజేరకుండిన నేమిప్రయోజనము? అంతియకాక, వానికై వ్యయపరచినధనముకూడ వృథాయయిపోవును. కాబట్టి, మానవులు ఉత్సాహమెక్కువగనుండు యౌవనమునందు బాగుగనాలోచించి మొదలిడిన కార్యముల పిమ్మట నెన్నికష్టములువచ్చినను, ఎందరు వలదని బోధించినను ఏమయినను వదలక పట్టుదలతో తుదవరకును ప్రయత్నించియే తీరవలెను.

మానవునియొక్క తెలివి యెందును పరిపూర్ణత నొందలేదు. ఒక విషయమునుగూర్చి నేర్చికొనినకాలదిని అట్టి వింకను నెన్నియో కనుబడుచుండును. మన కగోచరములును ప్రతివాడును నేర్చికొనవలసినవియునగు విషయములుకూడ పెక్కులున్నవనుటకు సందియముండరాదు. వానియొక్క ఫలితములు ముందుగ నిర్ణయించుటకు వీలులేదు. తుదవరకు నొనర్చి

వానినెరుంగుటవల్లనే మనకు జ్ఞానాభివృద్ధికాగలదు. కొలదిమంది అనుచరులతో నొక పడవనెక్కి సముద్రముమీద నెన్నియో యిడుములకోర్చి అమెరికాఖండమును మొట్టమొదట కనుగొనిన మహాత్ముని పట్టుదలవలననేకదా మనకు భూగోళశాస్త్రమునందలి జ్ఞానమభివృద్ధియైనది. ఉత్తరధృవాన్వేషణమునఁ ఎందరో మహాత్ములు తమ ప్రాణములగోల్పోయిరి. ఇంకను పట్టుదలవీడక మాహాత్ములు చనిపోయిన వారలననుకరించుచునేయున్నారు. కాని యింతవరకును ఆధృవమెట్టులెచటనుండునో యెవ్వరును జెప్పజాలరు. కాని అది కనుగొనబడిన వెనుక నావిషయమందరికిని గరతలామలకమగును. సుమారైదువందల యేండ్లక్రిందటివారికి అమెరికాఖండమును గూర్చియే తెలియదు. కాని మనమిప్పు డాఖండమును గురించి సమస్తము దెలిసికొనుచున్నాము. అట్లే ఉత్తరధృవమునుగురించియు, అట్టి మరికొన్ని విషయములనుగురించియుమనకు తెలియకుండినను, వానినెరుంగుటకై పాటుబడుచుండినచో ముందు రాబోవువారికైన జ్ఞానాభివృద్ధియగును. అందులకై ప్రయత్నించుటయే మనకందరికిని విధి.

ఇట్లుగాక ప్రతిపనిని సగపడజేసి విడచినచో మనశ్రమయంతయు వృథాయగును. ఓపికయును పట్టుదలయును లేనియెడల తుదకు నెరవేరగలకార్యములు సయితము చెడిపోవును. బెంగాలనబడు వంగదేశమును పరిపాలనా సౌకర్యార్థమై మనదొరతనమువారు విభజించినప్పు డాప్రదేశములందలి జనులందరును తమ అయిష్టమును గనబరచిరి. అప్పుడు దొరతనమువారేమియొనర్పవలయునని యాలోచింపసాగిరి. విడువ

క కొన్ని సంవత్సరములవర కాభాగములందలి ప్రజలనేకు లా
విభజనవలన తమకు లాభము లేదని తెలియజేసికొనుటచే జ
నుల యభిప్రాయము నెరిగి మన దొరతనమువారు మరల నావి
భజనను రద్దుచేసిరి. అట్లుగాక నావంగదేశీయులొక సంవత్సర
మావిభజన బాగుగ లేదనిమరలనూరకొనినచో మనదొరతనము
వారు ప్రజల యభిప్రాయమును దెలిసికొనజాలక తాము చేసి
నపని జనులకు లాభకారిగ నేయున్నదని యూరకుండియుందు
రు. ప్రజాభిప్రాయము దెలియనిచో ప్రజాసౌకర్యార్థము పా
టుబడు దొరతనమువారు మాత్రమేమిచేయగలరు? కావున ప
ట్టుదలచే, అసాధ్యముగ గానుపించు పనులను సయితమనేకము
లను సాధింప వీలుకలుగును.

కార్యసాధన కుపక్రమించినమీదట నిరుత్సాహమును,
విసువును ఎన్నటికిని జనింపకూడదు. ఆ రెండును లేకుండిన నెం
తయసాధ్యమని తోచెడు కార్యమునైనను సాధింపవచ్చును.
అన్యదేశీయులును, క్రైస్తవమతావలంబులునగు ఫాదరీలు మ
నదేశమునందొనరించు పరోపకారమే యిందుల కుదాహరణ
ము. లక్షలకొలది మైళ్ళదూరముననుండి సముద్రములనన్నిటిని
దాటి స్వమత ప్రచారమొనర్చు నభిలాషతో మనయీ దేశము
నకువచ్చి, వచ్చియు రాని తెలుగుమాటలతో ఏమాలపల్లెలయం
దో తమమతమును బోధించు క్రైస్తవపాదరీలకు, అదృష్టవ
శమున అనాథలగు మాలమాదిగశిశువులు కంటబడుదురు.
విద్యావంతులై ఖండాంతరముల నుండి సర్వజన సౌభ్రాతృ
త్వమును బోధింపవచ్చిన యీపాదరీలలో ననేకులకు అట్టి

బిడ్డలను గనుగొనినంతనే, బీదతనమునందును, అపరిశు
భ్రతయందును దాగియుండిన ఆ యనాథ బిడ్డల మానవ
స్వభావ మొక్కసారుగ విజృంభించి ప్రకాశవంతముగ క
న్నులయెదుట నగుపడును. అంతటితో వారి హృదయములు
కరగి, వారాబిడ్డలపై జాలిగొని తమ యనాథశరణాలయము
లకు తీసికొనిపోయి తినుటకాహారమును, కట్టుకొన వస్త్రము
లనిచ్చి విద్యాబుద్ధులగరపి పెద్దవారల నొనరింతురు. వారిలో
చెడిపోవువారును లేకపోలేదు. అట్టివారు మనయిండ్లయం
దుండినను బాగుపడజాలరు. కాని యెంత చెడినను వారికి వెను
కటి యవస్థమాత్రము తప్పును. స్పష్టముగ మాటలయినను
నుచ్చరింపజాలక సర్వదా అసహ్యించుకొనబడు నీబిడ్డల నట్టిస్థి
తికిదేగలుగు వారలకెంత యోపికయు, పట్టుదలయు నుండవలెనో
మనమే యూహించుకొనవచ్చును. అప్పటికప్పుడు దయచే తీ
సికొనిపోయినను యెంతబోధించినను తమ వెనుకటియలవాటుల
మానజాలని యిట్టిబిడ్డలను పట్టుదలయును, ఓపికయును లేనివా
రయినచో మరుదినముననే విడిచివేయవలసి వచ్చును. కాని
యీషాదిరీ లట్లొనర్చుటలేదు. కావున ఇట్టిదుష్కరములు
గ నగుపడు కార్యములసయితము నెరవేర్పగల యీపాశ్చా
త్యులదగ్గర మనము తప్పక ఓపికయు, పట్టుదలయు నన నెట్టి
వో నేర్చుకొనవలయును.

విశేషములు. గుంటుపల్లి సుబ్బారాయుడు,
రైలుపేట, గుంటూరు. అని వ్రాసిన తెలియగలవు.

వాణీ ముద్రాక్షరశాల, గుంటూరు. 1000—15.

గీ॥ "ఉద్ధరించెద దేశమే నొక్కరుఁడనె । నిశ్చయంబిది సేయంగ నేరఁడొరుఁడు"
అనుచు "విలియము పి"ట్టను నతఁడు వలికె । అట్లెయెల్లరు దలపఁగ నగును శుభము॥

# స్వయం సహాయము.

ఏకార్యమును నిర్వహింపవలసి వచ్చినను పరులసహాయమును నమ్ముకొనక, ముందుగా తనకు దానుతోడ్పడి తన కృషి జయప్రదమైనదిగా చేసికొనుట స్వయంసహాయమన బడును. తనకు దానుతోడ్పడిన వానికి దైవమును సహాయము చేయునందురు. మన మేకార్యమునైనను తలపెట్టినప్పుడు మన శక్తిసామర్థ్యములన్నియు వినియోగించిన తరువాతగాని ఇతరుల సహాయమును వేడకూడదు. మనశక్తికొలది పాటుబడియును మొదలిడినకార్యమును నెరవేర్పజాలకుండినప్పుడితరుల సహాయమును కోరవచ్చును. కాని, ఏపనినిగాని మొదలిడి దానికై చేతనయినంతవరకు ప్రయత్నించుటకుముందే పరులసాహాయ్యమును కోరగూడదు. తమకై తాముశ్రమపడనివారికి ఇతరులు సాయమొనర్చెదరనుమాట కలలోనివార్త.

ప్రతిమనుజునికిని స్వయంసహాయమువలని ప్రయోజనము తెలిసి యుండవలెను. స్వయంసహాయమన నేమియో దానివలన ప్రయోజనములేవో తెలియనివారికి ఆత్మాభివృద్ధియేర్పడదు. ప్రతివాడును తనయభివృద్ధికై పాటుబడనేర్చుకొని యెప్పుడు కృతకృత్యుఁడగునో అప్పుడే దేశమున కంతకును అభివృద్ధి కలుగును. శాంతముగను, న్యాయముగను పరిపాలింపబడుచుం

డినంత మాత్రమునే దేశమభివృద్ధి దశకురాజాలదు. కాని ప్రతి దేశజుని హృదయమునందును తానభివృద్ధిలోనికి రావలయునను దృఢనిశ్చయముకలిగి స్వతంత్రముగా జీవనముచేయుకొరకు నిరంతర కృషిచేయుచుండినయెడల దేశము చిరకాలముననే ఔన్నత్యమునకు వచ్చుననుటకు సందియములేదు.

ఇట్లు, ఎవనిశక్తి సామర్థ్యములచే వాడభివృద్ధినొందుటకు బీదతనమొక గొప్పయాటంకమని మనలో ననేకులుచెప్పుచుందురు. కాని యట్లూహించుట మిక్కిలిపొరబాటు. తమనిరంతర కృషివలన సామాన్యస్థితినుండి క్రమక్రమముగా ఉన్నతస్థితికివచ్చినవారు మానవులలో ననేకులుగలరు. ఆమహనీయులట్టి స్థితికిరాగలుగుటకు స్వయంకృషియే ముఖ్యసాధనము. లోకములో మహాపురుషులని పేర్కొనబడిన వారలలో బాల్యమునందు బీదస్థితిలోనుండి తమశక్తికొలదిని పాటుబడి పైకివచ్చినవారలేమెండు. భాగ్యవంతులన్ననో కావలసినంతయుండి పాటుబడవలసిన యవసరములేకపోవుటచే స్వయంకృషి యననెట్టిదో యెరుగజాలరు. ధనసాహాయ్యముచే నెరవేరజాలని కార్యములందెల్ల వారితరులసహాయమును కోరవలసియే యుండును. మొదటినుండియు సోమరితనమున పెరిగినవారగుటచే స్వల్పవిషయములందు సయితము వారితరులసహాయమునే అపేక్షింపవలసిన వారగుదురు. అందుచే వారున్నతస్థితికి రాజాలరు. శంకరాచార్యుడు కడుబీదవంశమున నొకపల్లెయందుదయించినను, దృఢనిశ్చయము కలవాడుకావున, స్వయంకృషిచేసి, శాస్త్రజ్ఞా

నమునుసంపాదించి నశించిపోవుచున్న హిందూమతమునకు మరలప్రాణముపోసెను. బీదతనము మొట్టమొదలు దురదృష్టముగ గన్పించినను, మనఃపూర్వకమగు స్వయంకృషిచే దానినే యదృష్టమునకు గారణభూతమగునట్లు చేసికొనవచ్చును.

అంతియకాక, కష్టకాలములందే మానవునియొక్క ధైర్యసాహసములును, మనోనిశ్చయమును, దృఢమైన పూనికయును వెల్లడికాగలవు. కష్టములే ధైర్యవంతునికి ఉత్సాహమును, శౌర్యమును, మనోబలమునొసగి ముందు రానున్న ఆపదలనెదుర్కొనుటకును, నిశ్చితార్థమును సాధించుటకును జాలునంతటి శక్తిసామర్థ్యములను కలుగజేయును. దృఢనిశ్చయముకలిగినచో మానవుడు కార్యసాధనకై తగినంత కృషిచేయును. నడుమనొకవేళ ఆటంకములు కలిగినను ధీరుడగు వాడాయుద్యమమును మానివేయడు. సగముచేసివదలినయెడల అంతవరకును పడిన శ్రమ వృథయగుననెడితలంపే ఆయనను ఇంకను ప్రయత్నించుటకు పురికొల్పును. అన్యులసహాయమును కోరక తలపెట్టిన కార్యమునకై స్వయముగ కృషియొనరించిన వానిపట్టుదలకును స్వయంసహాయమునకును మెచ్చుకొని యితరులుకూడ తమంతదామే తోడుపడనెంతురు.

మరియును కొందరు మనుజులయందు శక్తిసామర్థ్యములు నివురుగప్పిన నిప్పువలె నగుపడకుండి సమయమువచ్చినప్పుడు తేజోవంతములగును. అట్టివారెక్కుడుగ పరులసాహాయ్యమునకే యెదురుచూచువారుగా నుండిరేని వారిసామర్థ్యమును వారే తెలిసికొనజాలరు. వారతిస్వల్పకార్యములను సయితము

"ఇవిమనవంటివారిచే నగునవికావు" అనివదలివేయుచుందురు. రానురాను వారలకదియొక అలవాటుగ మారిపోవును. పిమ్మట నట్టివారేపని చేయుటకును శక్తిజాలక అన్నిటియందును ఇతరులసాయమునే వేడవలసినవారగుదురు. ఎంతటికష్టసాధ్యమగు పనినైనను ప్రతివాడును కొంచెముగాకున్న కొంచెమైనను సాధింపవచ్చును. అట్టియెడ దృఢనిశ్చయమును, పట్టుదలయునుగూడ గలవారైనచో దానినే మరియొకకొంచెము జేయుననుటకు సందియములేదు. కావున ముందుగనే నిదిచేయలేనని భయపడక ప్రతివాడును తలపెట్టినకార్యమునకై స్వయముగ కృషిచేయవలయును.

అంతియకాని, కార్యారంభమునందే అన్యులసహాయమునకై ఆలశించుటచే కలుగునష్టములు పెక్కులుగలవు. మనమెవరిసాయమునకై యెదురుచూచుచుందుమో అట్టివారు మనకు సహాయముచేయ నిష్టపడకపోవచ్చును. మనకు మంచిదియును, లాభకారియునని తోచిన విషయము వారికి చెడ్డదిగను, నష్టదాయకముగను గానుపించవచ్చును. అప్పుడట్టివారు సహాయముచేయగలిగియును చేయకపోవచ్చును. సహాయముచేసినను పనియంతయు ఆసాంతముగ నెరవేరువరకును అన్యులు సాయము చేయుచుండుట యసంభవము. అందుచే నన్యులపై నాధారపడి మొదలిడినకార్య మెంతమంచిదైనను, ఎంతజనోపయోగకరముగ నుండినను, ఇతరులు సాయముచేయమానినంతనే విడువవలసివచ్చును. అట్లుగాక, తమకుమంచిదని తోచినకార్యమునకై ఎవరికివారు స్వయముగ కృషిచేసిరేని

కావలసియుండినయెడల సాహాయ్యమునుదొరుకును; కార్యసాధనములును చేకూరును. కావున స్వయంకృషియే మిక్కిలి యుక్తమో త్తమమును, శ్రేయోదాయకమునని చెప్పవచ్చును.

అన్యులసహాయము నపేక్షింపక ఏదైన నొకకార్యమును సాధించుటలో స్వయముగ కష్టించుటకు మానవునికి స్వసామర్థ్యమునందు సంపూర్ణవిశ్వాసముండవలెను. కార్యారంభమునకు పూర్వము అట్టివిశ్వాసమెంత యవసరమో పిమ్మట ధైర్యమును అంతయవసరమే. ధీరుడగువాడు మొదటినుండి చివరవరకును స్వయముగ కృషిచేసియేకార్యమును సాధింపజూచుచుండును. నడుమ నెప్పుడైనను పరులసాహాయ్యమించుక కోరవలసివచ్చినను, అదియంతగ మంచిదికాదనియే యాతడుతలంచును. కాని పెక్కుసమయములందు తప్పనిసరియగుటచే కార్యసాఫల్యతయే ముఖ్యమనియెరిగి యాతడందులకీయకొనును. నేనిద్దానిని చేయగలనను ధైర్యముండిన నెట్టిదుర్ఘటముగ గనబడుపనినైనను సాధింపవచ్చును. ధూమశకటము, తంతిమార్గము, విద్యుద్దీపము మొదలగు అత్యద్భుతవిషయములను సాధించిన మహనీయులట్టి ధైర్యముతో పనిచేసియే కృతకృత్యులయిరి. స్వయంకృషిచే నట్టిమహత్తరములగు కార్యములు నయితము సాధింపబడియుండ, స్వల్పకార్యములయందు మాత్రము తనశక్తిని వినియోగించి మానవుడేల విజయమునొందకుండును.

ఏదైననొక కార్యమును సాధించుటలో మానవులందరికిని సమానమైన శక్తిసామర్థ్యములుండనేరవు. అట్లుండేనేని

పరులసహాయము నపేక్షించుటకే కారణముండదు. కాని పూనుకొనిన కార్యమెంతగొప్పదైనను, కార్యసాధనకై ప్రయత్నముచేయు మనుజుడెంత అసమర్థుడైనను, ఆకార్యమునందు కొంచెమోగొప్పయో పాటుబడ శక్తిగలిగియుండును. కాని ఎట్టివానికిగాని పూర్తిగా సామర్థ్యములేదని చెప్పుటకు వీలులేదు. ఎక్కువధనముచే సాధింపనగు కార్యమును ఒకనిరుపేద సాధింపబూనుననుకొందము. డబ్బువిషయములో నాతడొనర్పజాలు ప్రయత్నమూవంతయు లేదనియే చెప్పవచ్చును. కాని, ఆపనినెట్లులైన సాధింపవలెననెడి నిశ్చయమే ఆయనకుండెనేని వలయుధనమును అత్యల్పకాలముననే సంపాదింపగలుగును. లేనిచో నొకధనికునివద్దకుపోయి తానుతలంచినకార్యము సాధించు నట్లాధనవంతుని పురికొల్పి, ఆపనినెట్లులైన ఆతనిచే జేయించియేతీరును. ఇట్లాపనిజేయగలుగువాడు తనంతటతాను ధనమునీయలేకపోయినను తాను మంచిదని తలచినకార్యము నెట్లులైన స్వప్రయత్నముచేతనే నెరవేర్చెననియనవచ్చును. అట్టివానియెడల నదియే స్వయంసహాయమనబడును.

స్వయంసహాయముచే మానవుడనేక విషయముల సాధింపనగును. అంతియకాక నది పలుమారాతని కపరిమితలాభకారియు కాగలదు. ఒడలువంచి పనిచేయవలసిన దృఢకాయులగు వారెంతమంది స్వయంసహాయముయొక్క గౌరవము నెరుగజాలక సోమరిపోతులై స్వోదరపోషణకై పరులవేడుచున్నారో చూడుడు! కుంటి గ్రుడ్డివారల కందనీయక చీవాట్లకైన నోర్చుకొని, బ్రాహ్మణులమనియు, భట్టులమనియు, హరిదాసు

ణమనియు, జంగములమనియు, అజ్ఞానులగు గృహస్థులిచ్చు బిచ్చపుగింజలకై యెందరు మనదేశములో చేయిజాపుటలేదు! తగదనినచో నిది యేకులవృత్తియనికూడ వాదింతురు. ఇట్టిపని చేయగల దృఢకాయులగు బిచ్చగాండ్రిక నేదేశమునందును ఇన్ని లక్షలమంది లేరనియే చెప్పవచ్చును. వారికేమాత్రమును స్వయంసహాయమునందలి గౌరవము తెలియదు. పుణ్యమునకనిపోయి వారికిసహాయ మొర్చు విద్యావంతులకు సయితమా విషయ మొక్కింతయు తెలియదనియే అనవలసివచ్చును. అట్టి సోమరులకు ధనికులును, విద్యావంతులును, 'మీవంటివారలకిట నేమియుదాచియుంచలే'దని చెప్పి అన్యులనాసించుట యందలి కష్టమును, లోపమును అగుపరుపవలయును. అప్పుడేవారికి స్వయంసహాయమునందపేక్ష జనింపగలదు.

స్వయంసహాయమువలన కీర్తిసంపాదించిన శివాజి, ఆబ్రహాములింకనువంటి మహాపురుషుల జీవితములను ఆదర్శములుగ దీసికొని ఆవిధమున నున్నతస్థితికి రా బ్రయత్నించుట ప్రతిమానవునికిని ముఖ్యధర్మము. వారిజీవితములనుండి మనము నేర్చుకొనవలసిన విషయములనేకములుండును. ఎట్లామహాపురుషులు స్వయంకృషివలన నున్నతస్థితికివచ్చిరో, నిజదేశమునకేమి యుపకారమొనర్చిరో, ఎట్టిపట్టుదలతో తమకార్యముల నిర్వహించిరో, మనముగ్రహించి ఆప్రకారము నడచుకొన బ్రయత్నించిన మనముగూడ ఉన్నతస్థితికి రాగలుగుదుమనుటకు సందియములేదు. అట్టివారల జీవితచారిత్రముల జదువుటచే "మనముమాత్రమేల ప్రయత్నముచేసినంతవారముకాకూడదు?" అను

ఉద్దేశముతో ప్రతివాడును గొప్పవాడగుటకు కృషిచేయ మొదలిడును. ప్రయత్నమున కసాధ్యమెందును లేదు. మనహైన్యత పూర్వజన్మసంచితమునుగాదు; దురదృష్టసంభవమునుగాదు అమూల్యమగు కాలమును బాగుగనుపయోగించి నిరంతర కృషిచేసినయెడల గొప్పవారమగుదుము. లేనియెడల మనహైన్యమునకు మనమే కారణభూతుల మగుదుము.

## ప్రకటన.

ఆంధ్రజనసామాన్యముకొరకు, నూతనములును ఉపయోగకరమును, సుబోధకములును, అగువిషయములనుగూర్చి "జ్ఞానప్రసాదినీప్రచురములు" అనుపేర మాసమునకు రెండుకరపత్రము లచ్చువేయింపబడును.

ప్రచురింపబడిన విషయములు:—1 హిందూదేశమునందలి విద్య 2 అంత్యజులు 3 కలరా 4 సత్యసంధత 5 బుజువర్తనము 6, 7 ఆత్మగౌరవము 8 కాలముయొక్కవిలువ 9 విధేయత 10 గ్రంధపఠనము 11 పట్టుదల 12 స్వయంసహాయము

ప్రచురింపబడు విషయములు:- 1 స్వార్థత్యాగము 2 మానవధర్మములు 3 కృషి, అందలిగౌరవము.

విశేషములు: గుంటుపల్లి సుబ్బారాయుడు,
రైలుపేట, గుంటూరు
అనివ్రాసిన దెలియగలవు

గుంటూరు వాణీముద్రాక్షరశాలయందుముద్రితము.

గీ॥ "ఉద్ధరించెద దేశమేనొక్కరుఁడనె । నిశ్చయంబిది సేయంగ నేరఁడొరుఁడు"
అనుచు "విలియముపి"ట్టనునతఁడువలికె । అట్లెయెల్లరుదలపఁగనగును శుభము॥

# విద్యార్థులు.

జీవితకాలమంతటియందును విద్యార్థిదశయే సంతోషప్రదమైనది. సుఖదుఃఖములెల్లప్పుడును కలిసియేయుండును కాని విద్యార్థిదశయందు మానవులకు కష్టములంతగ నగుపడకుండును. వయసున పిన్నవారై సంసారభారముల నెరుగజాలమిని వారలకప్పుడే విషయముపట్లనైన యానందమును, ఉత్సాహమును కలుగుచుండునేకాని పెద్దవారలకువలె దీర్ఘాలోచనలును, చింతలును అడ్డుపడుచుండవు. ఎంతటి ఘనకార్యమునైనను, చేయవలెనను ఉత్సాహమును, ఒనర్పగలనను ధైర్యమునేకాని, నేనేల ఒనర్పవలెనను పెంకెధీరతయును, అల్పుడనగు నాచేనేమికాగలదను భయమును ఏమాత్రముండవు. అట్టితరుణమునందు మానవులొందగల సౌఖ్యములకును, కీర్తికిని ఉవ్విళులూరుటకేగాని, తలపైబడనున్న సంసారభారమును, అందలియిక్కట్లను దలచితలచి దుఃఖించుట కరనిముషమైనను వ్యవధియుండదు. వేయేల, అమితోత్సాహముతో మిన్నుమన్నుల నెరుగజాలక ఆనందాంబుధి నోలలాడుచు కేరింతలుగొట్టు నీయజ్ఞానులగు విద్యార్థులగనుగొని, వెంటనే సంసారసాగరమున దరగానక పరితపించుచు దైవమా యెన్నటికైన యీబాధలంతరింపగలవాయని దీనత్వముతో ఆకసమువంక చేతులు

జూచి పలుకుచుండు జనసముదాయమునుజూచిన ఎట్టివేదాంతినైనను తలగిరుక్కున తిరుగకమానదు.

జీవితమందంతటిలో నిట్టియుత్సాహసమయ మింకొకపరి రానేరదు. విద్యాభ్యాసనమొనర్చి పండితులై కీర్తిగడింపవలెనన్నను, ఆటపాటలయందును, వ్యాయామమునందును శ్రద్ధవహించి శరీరపటుత్వము సంపాదించనెంచినను, జీవితమందొనర్పవలసిన దేశాభివృద్ధికరములును జనోపయోగములునగు ఘనకార్యముల ఆరంభింపబూనినను గూడ విద్యార్థిదశయే మిక్కిలి యనుకూలమగు సమయము. విద్యార్థిదశ ప్రారంభించునప్పటికి మానవులమనము లతినిర్మలములై పరిశుభ్రముగ నలరారుచుండును. అప్పటికెవ్వకినిగూడ క్రమప్రవర్తనయనుమాటయుండదు. అప్పటినుండియే మానవులబుద్ధులును, కోరికలును, ఉత్సాహమునుగూడ వారికిదొరకు మిత్రులనుబట్టియు, వారు నేర్చుకొనువిద్యనుబట్టియు మారుచుండును. అప్పుడప్పుడే వారి వారినడతలకు ఒక్కింతక్రమమేర్పడు చుండును. విద్యావంతులును, బుద్ధిమంతులునగు మిత్రులను, న్యాయశీలురను, సన్మార్గవర్తులునగు తలిదండ్రులను, గౌరవనీయులును, నీతివంతులునగు బంధువులను గలిగియుండ తటస్థించిన బాలురకప్పటినుండియే సక్రమప్రవర్తన యలవడుచుండును. చిరపరిచయులును, బోధకులునగు, స్నేహితులబట్టియు, గురువులబట్టియు, విద్యార్థులప్రవర్తనమిట్టిదని నిరూపింపవచ్చును. విద్యావిహీనులును, దుర్మార్గులును, అక్రమప్రవర్తనగల వారలునగు స్నేహితుల జేరి తమబిడ్డలు విద్యార్థిదశయందు చెడునడతల నలవరచుకొనకుండ తలిదండ్రులు తగుజాగ్రత దీసికొనవలయును.

ప్రస్తుతపు విద్యాభ్యాసన విధానముల ననుసరించి కొందరు పెద్దవారయ్యును విద్యార్థులుగ నుండవలసివచ్చినను ఆకాలమంతయు విద్యార్థిదశయనవలనుపడదు. సామాన్య ముగ బాల్యావస్థగడచి యేడెనిమిది వత్సరములుపైబడి నప్పటి నుండియు మరల నిరువదిసంవత్సరముల యీడువచ్చువరకునే విద్యార్థిదశయని చెప్పవచ్చును. ఆకాలమునందే మానవులకు ప్రవర్తన యేర్పడుచుండును. ఇట్టితరుణమునే విద్యావంతులగు మనపూర్వులును విద్యార్థిదశయనియు, అమూల్యమగుననియు గ్రహించి బ్రహ్మచారులును, బ్రహ్మచారిణులునై, బాలబాలి కలు విద్యాబుద్ధుః నేర్చుకొనుట కుపయోగించు కొనవలసిన దిగ నేర్పరచిరి. ఆవయసుదాటి, బుద్ధులుముదిరినపిమ్మట మా నవుల కేవిషయమును, ఎంతబోధించినను అప్పటికే ప్రవర్తన మొకవిధమున ఏర్పడియుండుటచే అందంతగ మార్పులగలిగింప జాలదని గ్రహింపగలిగిరి. పాశ్చాత్య విద్యావంతుల అభిప్రా యమును ఈవిషయమున నిట్టులనేయున్నది.

ఈసందర్భమున మనపూర్వులు విద్యాభ్యాసనముతో పాటు సత్ప్రవర్తన మలవడుటకెట్టి యేర్పాటులొనరించిరో తెలిసికొనుట చాలఅవసరము. ఆదినములలో విద్యార్థులకును, గురువులకును సాంగత్యము మెండుగనుండెడిది. దేశకాలపాత్రా దుల నావంతయు గణింపక, ఎన్నడో యెవ్వరచిన ప్రాతపద్ధతు లననుసరించి, బాలురకును గురువులకునుగూడ సరిపడనికాల ములలో ఎప్పుడో నాలుగయిదుగంటలవరకు, ఏపాఠములనో యేకరువుపెట్టి, అంతటితో పొండనుచుండుట అప్పటిగురువుల

పద్ధతి యేమాత్రముకాదు. విద్యార్థిదశయందు విద్యాభ్యసన
మొనర్పనెంచిన బాలురందరు తమగురువులవద్దనే కాలము
బుచ్చుచుండెడివారు. అప్పటి గురువులన్ననో, ఎట్టెట్టులో
గొన్ని పరీక్షలగడతేరి ప్రభుత్వోద్యోగమునకే యెదురుజూచుచు
అంతవరకును పొట్టగడుపుకొన బడిపంతులవృత్తి నవలంబించిన
యువకులుకారు. మహాపండితులును, తపస్సంపన్నులును,
ధర్మస్వరూపులునై, ప్రజోపయోగమునకై నిరంతరమును
పాటుపడు మహాత్ములే ఆకాలపుగురువులు. అట్టివారినడతను,
వారలధర్మమార్గాను చరణమునుజూచి ఆనందించుచు, వారల
కడసేవజేయుకొలదిని విద్యార్థులు పాండిత్యమును, సత్ప్రవర్త
నమును, నేర్చుకొనుచుండెడివారు. నళంద మొదలగు ప్రఖ్యాతి
వడసిన పూర్వ విశ్వవిద్యాలయము లీపద్ధతులపైనే ఆధారపడి
యుండెను. అందలివిద్యార్థులకు. వారివారి యభిరుచిననుసరించి
వివిధవిషయములయందు పాండిత్యము గలిగించుటయును, శరీ
రపాటవము చెడి అల్పాయుష్కులు కాకుండుటకై వ్యాయామ
ము, స్వారిచేయుట, ఈతకొట్టుట మొదలగువాని యందభిరుచి
పుట్టించుటయును, జీవితకాలమునందు స్వార్థత్యాగులై నిరంతర
మును దేశాభివృద్ధికిని ప్రజాసౌకర్యమునకునుగాను శ్రమపడు
ఉత్సాహముబుట్టించుటయును, అప్పటి విద్యాలయముల ము
ఖ్యాభిప్రాయములై యుండెను. కాని ఇట్లు, ఈవిషయమున,
ఇద్దానితోగూడ, ఇన్ని సంవత్సరములలో, కడతేరిననేకాని నీకా
విషయమువచ్చిన దనజాలమని ఆనాటి విశ్వవిద్యాలయము
లేమాత్రమును విద్యార్థుల కఠినచట్టములతో బంధించి కృశింప
జేయులేదు. అందుచే అప్పటి మహాపండితులుసయితము, వి

ద్యావంతులయ్యును, నూరేండ్లు నిండ బ్రతుకుటకు ఆకాలపు విద్యాపద్ధతులే సాయమొనర్చినపటినను తప్పేమియునుండదు.

ఒకకాలపు విద్యార్థులే తరువాతి కాలపుప్రజలయ్యెదరు. అందువలన నేదేశమునందైనను, ప్రజలందరును విద్యావంతులును, న్యాయశీలురును గావలెనన్నచో కాలానుగుణ్యముగ విద్యాభ్యాసనపద్ధతుల మార్పుటత్యావసరము. ఒకకాలమున అప్పటి కనువగు రీతినేర్పరిచిన విద్యాపద్ధతులను, సాంఘికాచారములను, ఏమాత్రమును మార్పునిచ్చగింపక దేశమభ్యున్నతినంధి సాటిదేశములవలె ప్రఖ్యాతిగడింపవలెనన్న అదియసాధ్యము. తక్కిన దేశముల వారివలె మనమును మనస్థితిగతులకు సరిపడునట్టుల విద్యాపద్ధతులను సాంఘికాచారములను క్రమేణ మార్చుకొనవలయును. పూర్వపు విద్యార్థులకు చదువుచెప్పుటయేకాక అప్పటిగురువులే వారికిసాంఘిక నియమములనుగూడ బోధించిరి. కాని యిప్పటిచదువునకును సంఘమునకును చాల దూరముకలదు. గురువులకు సాంఘికాచారములు పట్టవు, సంఘము నరచేతనాటలాడించుచు ఇచ్చవచ్చిన వారిని వెలివేయుచుండు సాంఘికగురువులకు చదువుపట్టదు. ఇకవిద్యార్థుల ప్రవర్తననుగురించియు, భావిజీవితములనుగురించియుఒక్కింతతలిదండ్రులకుదప్ప, గురువులకును, సాంఘికగురువులకునుగూడబట్టదు. ఇట్టి స్థితిగతులుగల మనదేశమీరోజులలో మరల పూర్వపుటౌన్నత్యమునకు వచ్చుట మిక్కిలి కష్టసాధ్యము.

మనదేశపు భావ్యభివృద్ధియంతయు ప్రస్తుతపు విద్యార్థులపైనే ఆధారపడియున్నది. వీరును తమ వెనుకటి వారివలెనే

ఉదరపోషణమే ముఖ్యాదర్శముగ నుంచుకొని, ఎంతపాండిత్య
ము సంపాదించినను, ఎంత గొప్పయుద్యోగములలో నున్నను,
దేశము బాగుపడ నేరదు. విద్యార్థిదశయందిప్పుడిప్పుడే కొలది
గ మార్పులేర్పడసాగినవి. అచ్చొక కొంతమారి క్రొత్తరకపు
విద్యార్థులును ఉద్యోగస్థులును ఇప్పటికే కొందరేర్పడిరి. కాని
వారు మిక్కిలి కొలదిమందిమాత్రమగుటచే అక్రమప్రవర్తన
గలవారును అజ్ఞానులునగు జనసముదాయమునమునిగి యదృ
శ్యులగుచున్నారు. విద్యార్థులమనము లింకను న్యాయమార్గ
మునకును, ధర్మము వైపునకును తిరుగవలయును.

చదువుకొనుట ధనార్జనమునకేనని ప్రస్తుతము విద్యార్థు
లలో ననేకులభిప్రాయ పడుచున్నారు. అందుచే పాశ్చాత్య
దేశచరిత్రలును, సాంఘికాచారములను వారెంతవల్లించినను
గూడ నింకను వారలకందలి భావము లేమాత్రమును బోధపడు
చుండుటలేదు. ఆదేశములవారెట్లు తమదేశమునకును సంఘము
నకునైతమసర్వస్వమును ధారపోయ వెనుదీయరో, వారికే
కారణములచే అభ్యున్నతియు ఐశ్వర్యమును సమకూడినవో
మనవారింకను గమనించుటలేదు. పాశ్చాత్యచరిత్రలను చదు
వుటయేగాని అందలిఆదర్శముల గమనించి ఇచటి విద్యార్థులిం
కను పెంపొంద జూచుటలేదు.

ఇట్లు మనవిద్యార్థు లెంతకాలము ప్రవర్తింతురో అంత
వరకును మనదేశమిట్లేయుండును. చదివిన ప్రతివిషయమును
బాగుగ పరిశీలించి నేర్చుకొనవలయును. అట్లు నేర్చుకొనిన విష
యములను జీవితముల యందుపయోగించు కొనవలయును.

అప్పుడే విద్యావంతులకును, విద్యా విహీనులకునుగల తారతమ్యమగుపడగలదు. లేనిచో విద్యాభ్యాసనమునందు గడచిన కాలమంతయు వృధయయిపోవును.

విద్యార్థులు దేశాభ్యుదయము నందెక్కువ శ్రద్ధబూనవలయును. ఏవిధమున నైనను జ్ఞానమును, సత్ప్రవర్తనమును సంపాదించవలయును గాని రోకటిపాట కెంతకాలము వ్యయపరిచినను ప్రతిఫలముండదు. విద్యార్థులు కొందరు మనకిప్పుడు మతవిషయములతో పనియేమనియు, మరికొందరు సాంఘికాచారములతో మనకేమనియు, ఇకకొందరు మనకుద్యోగములయిన జాలును, తక్కిన వారివిద్యావిషయమై మనకేలయనియు, కాలముబుచ్చుచుందురు. అజ్ఞానులగు నిట్టివిద్యావంతులును, విద్యావిహీనులును నిండియుండుటయే మనదేశపు ప్రస్తుతపుస్థితికి కారణము. సమయమునుబట్టి అన్ని విషయములను నేర్చుకొనుచుండవలయునేగాని జీవితమున నీవిషయ మీతరుణమున నేర్చుకొనవలెనను నియమమెచ్చటను యుండదు. మత, సాంఘిక విషయముల నెరుంగుటయు విద్యాభ్యాసనమేయగునని మన విద్యార్థులు తెలిసికొనవలయును.

విద్యార్థిదశయందే అన్ని విషయములను బూర్తిగ నెరుగుట యసాధ్యమని కొందరనవచ్చును. కాని, మత, సాంఘిక, రాజకీయ, నైతికాదులలో దేనికిసంబంధించిన విషయమునైననెట్లు పరిశీలించి అందలి ముఖ్యాంశము కనుగొనవలయునో తెలిసికొనుటయే విదార్థుల ముఖ్యధర్మము. చూడగనే యిది తగునిది తగదని యూరక విద్యావిహీనులవలెనక, బాగుగ

నందలి సత్యాసత్యముల బరిశీలించి యభిప్రాయము లేర్పరచు కొనగలుగుటయే విద్యార్థుల ముఖ్యచిహ్నము. అందులకు తగు శాంతమును, ఓపికయు లేనివారెన్ని పరీక్షలనారితేరినను విద్యావంతులనఁజెల్లదు. అక్రమమును, లంచగొండితనమును, మూర్ఖతయు, మూఢవిశ్వాసమును విద్యార్థులయెడ నేమాత్రము నుండగూడదు.

మానవుని నడతయంతయు విద్యార్థిదశపైనే యాధారపడియుండుటచే విద్యార్థులు తమప్రవర్తన నతిజాగరూకులై మార్చుకొనుచుండవలెను. మహాత్ముల జీవితములజదివి యందలి నీతులను, గ్రహించుటయు చరిత్రలను శాస్త్రములను జదివి జ్ఞానమును సంపాదించుటయునేగాన, తగురీతిని తమజీవితకాలమంతటిని మానవసేవయందును, దేశసేవయందును గడపి జన్మసాఫల్యతనొందుటకై విద్యార్థులెల్లపుడు ప్రయత్నించుచుందురుగాక!

## ప్రకటన.

ప్రచురింపబడు విషయములు.– 1 స్వార్థత్యాగము 2 మానవధర్మములు 3 కృషి, అందలిగౌరవము.

విశేషములు: గుంటుపల్లి సుబ్బారాయుడు,
రైలుపేట, గుంటూరు
అనివ్రాసిన దెలియగలవు

గుంటూరు వాణీముద్రాక్షరశాలయందుముద్రితము.

గీ॥ "ఉద్ధరించెద దేశమే నొక్కరుడనె। నిశ్చయంబిది సేయంగ నేరడొరుడు"
అనుచు "విలియముపిట్టు"నతడు పలికె। అట్లెయెల్లరు దలపగ నగును శుభము॥

# పాశ్చాత్యపుస్తకభాండాగారములు.

ఇంగ్లాండు, అమెరికా మొదలగు పాశ్చాత్యదేశము లన్నివిధముల నానాటి కభివృద్ధినందుచుండ, మన హిందూదేశము మాత్ర మెంతయు వెనుకబడి యున్నది. పెక్కు శతాబ్దములనుండియు నభివృద్ధి నొందకుండినను, హిందూదేశపు పూర్వపు నాగరకతయు నౌన్నత్యము, నిప్పటికిని వివిధదేశముల వారి కాశ్చర్యము గొలుపుచున్నవి. ఇప్పుడిప్పుడే మరల నీదేశీయుల మనంబుల నొక నూతనోత్సాహ మంకురించినది. అదియే వారిని పెక్కేండ్లనుండియు నావరించియున్న గాఢనిద్ర నుండి మేల్కొలిపి, పూర్తిగ నశింపనున్న జాతీయశక్తులకు మరల నుద్రేకము గలిగించుచున్నది.

జనసామాన్యముయొక్క అభివృద్ధినిబట్టియే, ఇక హిందూదేశపు భావ్యభివృద్ధి యేర్పడును. అజ్ఞానమే ప్రస్తుతపు జనసామాన్యపు దుస్థితి కంతటికిని మూలకారణము. ఏదేశమునందు విశేషభాగము జనులు విద్యావిహీనులై, అజ్ఞానమున నల్లాడుచుందురో, ఆదేశమున నొక కొందరు విద్యావంతులును, మహాపండితులు నుండిననుగూడ, ఏమాత్రము నభివృద్ధి కలుగ నేరదు. ముఖ్యముగ మన జనసామాన్యమున కిపుడు కావలసినది నిర్బంధమును, ఉచితమునగు ప్రారంభవిద్యయేయని

మనవా రనేకులు గ్రహించియే యున్నారు. కాని ఇంకను యెంత ఉపయోగకరములగు విద్యాపద్ధతులైనను, వానితో గూడ ఉచిత పుస్తకభాండాగారములును బాగుగ వ్యాప్తము చెందనిచో, అంతగ లాభము కలుగనేరదని మనవారల కింక ను తోచినట్లుగుపడదు. తగువిధమున కావలసినన్ని ఉచిత పుస్తకాగారములు లేని కారణముచేతనే, బడిచదువైనమీాదట ననేకమంది యేావనః లేమొనర్చుటకును దెలియక, ఏవిషయ మునను పాండిత్యము సంపాదింపలేక యెందులకును కొరగాని వారగుచున్నారు. అందుచే, ఇండియాదేశము నభివృద్ధిచేయ దలచుకొన్నవా రూరక పాఠశాలల నభివృద్ధిచేయుటయేగాక, వానితోగూడ నుచిత భాండాగారములను గూడ నెలకొల్పు చుండవలయును. ప్రస్తుతము మన జనసామాన్యముయొక్క విద్యాభివృద్ధికై పాటుబడనెంచువారు పాఠశాలలకును పుస్తక భాండాగారములకును గల పరస్పరసంబంధములను బాగు గ గ్రహింపవలయును. పాఠశాలలు జనుల కన్నివిషయము లందును కొంతకొంత జ్ఞానముకలిగింప జాలును. కాని గ్రంథా లయములవల్లనే వారివారి జ్ఞాన మొకొ్కక్క విషయమునం దును సంపూర్తి నందగలుగును. అంతియగాక దేశాభివృద్ధి కరములగు సేవను లొనర్పవలయునన్నను, అట్టివారు మున్ముం దు, తమదేశ మప్పుడెట్టి స్థితిలోనున్నదియు, నేకారణములచే నాదేశమున కాస్థితి ప్రాప్తించినదియు, నిక నందుల కేప్రతిక్రి య నొనర్పవలయునదియు, మొదలగు సంగతుల నన్నిటిని బాగుగ నెరిగియుండవలయును. అందులకును పుస్తకభాండా గారములే శరణ్యములు.

మన దేశమునం దిప్పుడు విద్యావంతులును, నాయకు లు ననబడు వారలకు నయిత మింకను పుస్తకభాండాగారము ల నెన్నివిధముల నభివృద్ధి చేయ వీలగునదియు, నప్పు డవెంత లాభకారులగునదియు, దెలియకుండు టెంతయు సంతాపకర ము. యూరపుఖండమందును, ముఖ్యముగ నమెరికాయందు ను, ఇప్పు డెన్నివిధముల, నెంత త్వరితముగ భాండాగారము లభివృద్ధి చేయబడుచున్నదియు, అందుచే ఆదేశములం దిప్పు డు విద్యావిషయములం దెట్టిమార్పులు కలుగుచున్నదియు మ నవారల కందరకు నెంత శీఘ్రముగ దెలిసిన నంతమంచిది. ఈ విషయములన్నియు మనవారల కెన్నడు మనసున బాగుగనా టునో, ఎన్నడు మనదేశమునం దెటుచూచినను, అన్నివిధము ల నభివృద్ధిచెందిన ఉచితపుస్తకాగారములే అగుపడుచుండు నో, ఆదినమే మన హిందూదేశపు పురోభివృద్ధికి మొదటిదిన మని మనము భావింపవచ్చును. అప్పుడే పాఠశాలలనుండియు కళాశాలలనుండియు దరుమబడి, యెందులకును కొరగానివా రమనుకొను లక్షలకొలది హైందవయావనులం దణగియున్న ప్రతిభయంతయు నొక నూతనవికాసమున బయల్పడి లోకము ను మిరుమిట్లు గొలుపజాలును. ఇట్టి పుస్తకభాండారముల మ హాత్మ్యము నెంతవర్ణించినను తనివితీరదు. కాని దానిని పూ ర్తిగ దెలిసికొనగోరువా రొకపరి పాశ్చాత్యదేశములందలి యొకటి రెండు చక్కని గ్రంథాలయములను దర్శించినచో, మానవుల కవెంత లాభకారులో, వానిచే జనులకెట్టి యుత్సా హమును, ఆవేశమును జనించునో కొంచముగాకున్న కొంచ మైనను బోధపడగలదు.

పుస్తకభాండాగారాభిలాషయు, వివిధమతాభిలాషలు గల మన హైందవప్రజల మనముల నాకర్షింపవలయును. మతావేశముచే నసాధ్యకార్యకరణదక్షులగు మన విద్యాధికులీ నూతన మతావేశమును సయితము నిరసింపక, యుత్సాహముతో పనిచేసి రానున్న హైందూదేశౌన్నత్యమునకు తగు పునాదుల నిప్పుడే యేర్పరచవలయును.

మిక్కిలి ప్రసిద్ధకెక్కిన అమెరికా యందలి పుస్తకభాండాగారము లిపు డేయుద్దేశములతో, నెన్నివిధముల నభివృద్ధి చెందుచున్నవో తెలిసికొనుట యుక్తము. నవీనభాండాగారముల ముఖ్యాభిప్రాయమంతయు, సంఘమునందలి ప్రజలందరిని, బాలబాలికలను సయితము, విద్యావంతుల నొనర్చుటయు, వారికి లోకమునందలి చక్కని సారస్వతమునం దభిలాష పుట్టించుటయునై యున్నది.

పూర్వపు పుస్తకాలయము లొకచోటనే కదలకయుండి దగ్గరకు జేరినవారికి కావలసిన గ్రంథముల నొసంగుచుండెను. కాని యిప్పటివానిపని వేరు. అవే దేశమందంతటను తిరిగి యౌవనులను, బాలురను, వృద్ధులను, స్త్రీలను వెతకి వెతకి, వారలలో నెవరికి కావలసిన గ్రంథములు వారికొసగుచుండును. అంతియగాక పుస్తకములందెట్టి అభిలాషయు లేని వారికి సహిత మీ గ్రంథాలయములు ఏ ఉపాయములచేతనైన నభిలాష బుట్టించును. చందాలనిచ్చువారే చదువనర్హులను నియామక మీ గ్రంథాలయముల కేమాత్రము నుండదు. ఇప్పుడమెరికాలో పెద్దవారే గ్రంథాలయముల నుపయోగించుకొనవచ్చున

ను నియమమునులేదు. బాల బాలికలే పెరిగి పెద్దవారగుదురు. గనుక వారికి పసితనమునుండియు, గ్రంథాలయముల నెట్లుపయోగించుకొనవలెనో నేర్పబడుచుండును. వారినాకర్షించుటకై ప్రతి గ్రంథాలయమునందును, నీతులుగల సులభశైలి గ్రంథములును, కథలపుస్తకములును, మహాత్ములయొక్క పటములునుగల ప్రత్యేకభాగమొకటి ఉండును. వారికావిషయములనుగురించి బడిలో ఉపాధ్యాయుడును, ఇచట గ్రంథాలయాధికారియుగూడ బోధించుచుందురు. అంతియగాక పసివారగువారిని దగ్గరతీసి నెమ్మదిగ వారికితగు విషయములను బోధించుటకై కొన్ని గ్రంథాలయములందు కొందరు విద్యావంతులగు స్త్రీలును నియమింపబడియుందురు. పాఠశాలలందలి బాల బాలికల కప్పుడప్పుడు, వారివారితరగతుల ననుసరించి, లోకమునందంతటను ప్రఖ్యాతివడసిన మహాత్ముల జీవితములను, ఉపయోగకరములగు చిన్నచిన్న కథలను వారమునకొకపరి బోధించెదరు. పిమ్మట, ఆవిషయములనే మాజికులాంతర బొమ్మలమూలమున వారికి గనబరతురు. అంతట ఆవిషయములనుగురించియె సులభముగ వ్రాసిన కరపత్రముల పంచిపెట్టుచు, నాసంగతులింకను, ఏపుస్తకములలో వ్రాయబడియుండునో తెలియజేసెదరు. ఇప్పుడిప్పుడీగ్రంథాలయములలో బాల బాలిక లాటలాడుకొనుటకును వసతులేర్పరుపబడుచున్నవి.

పాఠశాలలకును గ్రంథాలయములకును, ఇప్పుడమెరికాయందున్న సంబంధమింతయని వక్కాణింపవీలులేదు. ప్రతి పాఠశాలయందు నొక సామాన్యభాండాగారముండుటయేగాక

కావలసినప్పుడెల్ల సమీపమునందలి పెద్ద భాండాగారములు నుపయోగింపబడుచుండును. గొప్పగొప్ప పుస్తకాలయము లొకచోనుండక, అనేకచోట్లకు ప్రయాణముగూడ చేయుచుండును, ఇందులకై గ్రంథాలయము తరఫున ప్రయాణము చేయువారు మొదట కొందరుపాధ్యాయుల నొకచోజేర్చి, వారికి తమ గ్రంథాలయమును గురించిన సంగతులన్నిటిని దెలియబరచి, వారిసహాయముచే విద్యార్థు లేయేపాఠములకుగా నేయేగ్రంథములచదువవలయునో, వానిపట్టికలనుతయారు చేసి అపట్టికలను పాఠశాలలన్నిటియందును తగిలింతురు. ఇట్లు ప్రయాణముచేయు భాండాగార ప్రతినిధు లాయాచోటులగల ఉపాధ్యాయుల కప్పుడప్పుడు కావలసిన పుస్తకములనిచ్చుచు, పుచ్చుకొనుచుండుటయేగాక, వారినడిగి యింక నేయేగ్రంథములు వారివారికి కావలయునో తెలిసుకొని, వానినన్నిటిని పుస్తకాలయమునకై కొనుచుందురు. ఇంటిదగ్గరచదువుకొన వీలులేని పేదవిద్యార్థులకీ గ్రంథాలయములందే తగుయేర్పాటులు చేయబడుచుండును.

గ్రంథములందెట్టి శ్రద్ధయులేనివారికి సయితమొక కొన్నిటి నూరక నటునిటు త్రిప్పుచుండుటచేతను, వానియన్నిటి పేర్లనూరక చదువుచుండుటచేతను, వివిధగ్రంథములయందలి విషయసూచికల బరిశీలించుచు నేయేవిషయము లేయేపుస్తకములందుండునదియు దెలిసికొనుకొలదిని, పుస్తకములందొక విధమగు నభిలాషయేర్పడును. అట్టి అభిలాషను బుట్టించు నుద్దేశముతో నిప్పుడమెరికాయందలి గ్రంథాలములన్నిటియం

దును, చదువరులూరక గ్రంథములను తిరుగవేయుచుండుట కేర్పాటులుచేయబడును. చూచువారేమాత్రమును గ్రంథముల నపహరింపకుండగను, వానిని మరల తీసినచోటులందే పెట్టు నట్లును చూచుటకై ప్రత్యేకము కొందరు నౌకరులేర్పాటై యుందురు. ఇదిమిక్కిలి ఉపయుక్తమగు పద్ధతి. ఏవిషయమున దామభివృద్ధికి రాగలరో తెలిసికొనజాలనివారూరక, సాహిత్యము, భౌతికశాస్త్రము, చరిత్ర, వాణిజ్యము, శిల్పము, వడ్రంగము, వ్యాయామము, మొదలగు వివిధవిషయములను బరిశీలన చేసిచేసి తుదకు తమకనుకూలించుదాని నేరుకొనగలుగుదురు. ఎందునను అభిలాషలేనివారికీ పద్ధతివలన నెందైన నభిలాష జనించును. ఈ యుద్దేశ్యముతో గ్రంథాలయమును, అందలి బీరువాలును యెల్లప్పుడు తెరువబడియే యుండును.

ఇక నేవిషయమును గురించియైనను సమాచారము కావలసిన వారట్టిసంగతులను జెప్పుటకై యేర్పరచబడినవారి దగ్గరకుబోయి కనుగొనవచ్చును. గ్రంథాలయమునందలి అట్టి గుమస్తాగారివద్ద సామాన్యముగ కావలసిస అనేక విషయములలో, నేవిషయమున కేయేగ్రంథము లనుకూలించునో వాని యన్నిటిపేర్లును జాబితాలుగ తయారు చేయబడియుండును. అంతియగాక ఆయా విషయములనుగురించి అదివరకు వార్తాపత్రికలలో ప్రకటింపబడిన విషయములనన్నిటిని కత్తిరించియుంచి వెలకై కావలసినవారల కిచ్చు వర్తకసంఘములనుండి ఆగుమాస్తాయే వానిని తెప్పించి పాఠకులకిచ్చుచుండును.

యేవిషయమునుగురించియైన గావలసిన సంగతులనెల్ల నెంత ప్రయాసపడియయినను కావలెనన్న వారలకు తెలియజేయుట యే యాయుద్యోగస్థుని ముఖ్యవిధి. కొందరికి మాటిమాటికిని గ్రంథాలయముదగ్గరకు వచ్చుచుండుటకు యిష్టముగాని, తీరిక గాని లేకపోయినను కొన్ని సంగతులు తెలిసికొనవలసి వచ్చును. అట్టివారికి కొన్ని పుస్తకభాండాగారములవారు టెలిపోననబడు విద్యుచ్ఛక్తిచే దూరపువారితో మాట్లాడవీలగు యంత్రములద్వారా సంగతులను తెలియబరతురు.

(సశేషము).

---

# ప్రకటన.

ప్రచురింపబడు విషయములు.-1 స్వార్థత్యాగము 2 మానవధర్మములు 3 కృషి, అందలిగౌరవము.

విశేషములు: గుంటుపల్లి సుబ్బారాయుడు,
రైలుపేట, గుంటూరు.
అని వ్రాసిన దెలియగలవు

---

గుంటూరు వాణీముద్రాక్షరశాలయందు ముద్రితము.

గీ॥ "ఉద్ధరించెద దేశమే నొక్కరుడనె। నిశ్చయంబిది సేయంగ నేరడొరుడు"
అనుచు "విలియముపి" ట్టనునతడు పలికె। అట్లెయెల్లరు దలపగ నగును శుభము॥

# పాశ్చాత్య పుస్తకభాండాగారములు.

(గతసంచిక శేషము).

ఈ గ్రంధాలయములందే కొన్నిచోట్ల ఇదివరలో లోకమందంతటను రిజష్టరు చేయబడిన అనేకరకములగు వస్తువుల యొక్కయు గ్రంధములయొక్కయు స్వామ్యమె (హక్కు) వరికెంతకాలమువరకుండునదియు, నేవర్తకుల వర్తకచిహ్నమెటులుండునదియు మొదలగు సంగతులను తెలియజేయు నేర్పాటు లతివిచిత్రముగ జేయబడియుండును. ఇవి వర్తకులకును, తదితరులకును గూడ మిక్కిలి లాభకారులగునుండును.

ఇట్టి పెద్దగ్రంధాలయములలో నూతనవిషయములను కనుగొనుటకును, చరిత్రలు వ్రాయుటకునుగాను పరిశ్రమ జేయుచుండు పండితు లనేక దినములవరకు నేయాటంకములును లేకుండ గ్రంధపరిశీలన మొనర్చుటకు తగుప్రదేశము లేర్పాటుచేయబడియుండును.

దేశమునందలి జనులు సోమరులు కాకుండుటకుగాను వివిధవృత్తులనుగురించిన పుస్తకముల జాబితాలను తయారు

చేసి గ్రంథాలయాధికారియే ప్రజలకు బంచిపెట్టును. ఆయన యే కావలెనను వారికందరికిని, ఆయూవృత్తులను చేతిపనుల ను నేర్పు పాఠశాలలకును తమగ్రంథములను సమాచారము లను తపాలాద్వారానైనను, వేరువిధముననయినను బంపుచుం డును.

మన దేశమునందువలె గాక పాశ్చాత్య దేశములందు గ్రుడ్డివారికిని పాఠశాలలుగలవు. వారికిని చదువుట నేర్పబడు ను; గాని వారిగ్రంథములయందలి వ్రాత వంకరను బట్టి కండ్ల తోచూచి చదువదగినదిగాక మిట్టపల్లములుగనుండి చేతితో తడవుచు చదువుటకు వీలయినదిగనుండును. వానిని తయారు చేయుటకు విశేషద్రవ్యమును, ఎక్కువ శ్రమయును కావలసి యుండుటచే నా లిపియందు గ్రంథములు సులభముగ తయారు చేయుటకు వీలులేదు. ఈకారణముచే నట్టిగ్రంథము లతిఅరుదు గ వెలువడుచుండును. అందువలన అమెరికాయందలి పెద్ద భాండాగారములవారు గ్రుడ్డివారి గ్రంథములను గూడ దొరకి నమట్టునకు చేర్చి యొకచో భద్రముగనుంతురు. వానినితరపు స్తకములవలె చదువరులకిచ్చి పుచ్చుకొనుచుండుటయె గాక వానిని కావలెనన్నచో దూరదేశమునందలి చదువరులకు స యితమూరక పంపుచుందురు. వానినటునిటు పంపుటకై గ్రం థాలయాధికారులవద్ద తపాలావారేమాత్రమును డబ్బుతీసికొ నరు. అప్పుడప్పుడట్టి పుస్తకములలో లేనివిషయములను, సా మాన్యగ్రంథములనుండి చదివి గ్రుడ్డివారికి వినుపించుచుండుట కును ఏర్పాటు లనేకగ్రంథాలయములందు గలవు. ఈసంగతు

లన్నియు గ్రంథాలయములయొక్క ఉపయోగముల నేమాత్ర మును చవిజూచి యెరుగని మన జనసామాన్యమున కాశ్చ ర్యము గలిగింపవచ్చును. కాని ఇవన్నియు నిజమగు సంగతు లేయనియును, ఇన్ని విధముల విద్యాభివృద్ధి చేయబడుచుండు టచేతనే పాశ్చాత్య దేశము లిప్పటిస్థితిలోనికి రాగలిగినవనియు ను మనవారు గమనింపవలయును.

క్రొత్తగ విద్యార్థిదశవదలి యేదియో యొకవృత్తి న వలంబింపనున్న యౌవనులకు, ధైర్యము, పట్టుదల, ఉత్సాహ ము, సత్ప్రవర్తన మున్నగు సద్గుణము లలవడజేసి జాతీయాభి వృద్ధిజేయుటకు పైజెప్పిన గ్రంథాలయములం దేర్పాటులున్నవి. అట్టివారికొరకై కొన్ని గ్రంథములు ప్రత్యేక మేర్పరుపబడి యుండును. అట్టితరుణమునందు సామాన్యముగ మనుజుల కెట్టి గ్రంథములుపకరించునో అవన్నియు నాప్రత్యేకశాఖయం దుండును.

సామాన్యముగ చదివి అప్పటికప్పుడానందించుచుండు టకేగాని జీవితమునందెందులకును పనికిరాని నవల నదేపనిగ జదువుచు తక్కినశాస్త్రములను, చరిత్రలను, చదువకుండుట మనవారికివలె నమెరికావారికిని అలవాటే అయియున్నది. కా వున నాదురభ్యాసమును మాన్పుట కాగ్రంథాలయములందొ క చక్కని యేర్పాటుకలదు. సామాన్యముగ నవలలుండు ప్ర దేశమున కవతలివతలివైపులనే నిజమగుసంగతులను తెలియ జేయు జీవితములో, చరిత్రలో ఉంచబడును. అంతియగాక, కే వలము కల్పితములగు నవలలకును అట్టి యితరపుస్తకములకు

ను గూడ అట్టలపై, అన్నిగ్రంథముల అట్టలమీదవలె ఒకటిగాక రెండేసి వరుససంఖ్యలు వేయఁబడియుండును. అందు మొదటిసంఖ్య అట్టికల్పితమగు పుస్తకమొకటి ఏవరుసలోనుండునదియు దెలియజేయును. రెండవది అందేవిషయమునుగురించి కల్పితములగు సంగతులు వ్రాయబడియుండునో, ఆవిషయమునుగురించియే యదార్థములగు సంగతులు వ్రాయబడిన గ్రంథములజాబితాలో నీపుస్తకపు వరుససంఖ్యను తెలియజేయును. కాదేని, ఆగ్రంథకర్తచేతనే వ్రాయబడిన గ్రంథములన్నిటియొక్క జాబితాలో నీపుస్తకపుసంఖ్యను తెలియజేయును. అందు ఆగ్రంథకర్తచేతనే వ్రాయబడిన యదార్థవిషయములను గురించిన గ్రంథములును ఉండును. ఈయేర్పాటువలన ఒక విషయమునుగురించి కేవలము కల్పితములగు కథలను గలిగియుండు పుస్తకములను చదివినవారికి, ఆవిషయమునుగురించిన నిజమగు సంగతులను గలిగియుండు పుస్తకములనుగాని, ఆగ్రంథకర్తచేతనే వ్రాయబడిన యదార్థవిషయములను గలిగియుండు పుస్తకములనుగాని చదువవలెనను కోరిక క్రమేణ కలుగుచుండును.

జనులయందు భూగోళశాస్త్రజ్ఞానము నభివృద్ధిచేయుటకై అప్పుడప్పుడిట్టి గ్రంథాగారములవారు వివిధదేశములందలి ముఖ్యస్థలముల ఛాయాపటములను ప్రజలకగుపరచుచుండుట కలదు. పలుదేశములందలి, చిత్రవిచిత్రములగు వస్తువులును, రమ్యములగు పటములును, బొమ్మలును, గొప్పగొప్పవారల ఛాయాపటములును, జాగ్రత్తగ సమకూర్చబడి, చూచు

వారల కొరకై భాండాగారములందే యొకచో భద్రముగ నుంపబడి యుండును.

అమెరికాయందలి ఉచితపుస్తకభాండాగారములు ప్రత్యేకమేర్పరుపబడిన యుద్యోగస్థులమూలమున దేశమునం దంతటను తిరుగుచు ప్రజల కందుబాటులోనుండునని ఇదివరకే చెప్పబడినది. ఇదిగాక ఇట్టి పెద్దభాండాగారములకు సంబంధించి అచ్చటచట శాఖలుగను, ఉపశాఖలుగను చిన్నభాండాగారము లుండును. పెద్దభాండాగారములు తమకు సంబంధించిన చిన్న గ్రంథాలయములకు కావలసినపుడు పుస్తకముల నరవిచ్చుచుండుటయేగాక, కావలసినపుడెల్ల ఇతర పెద్దభాండారములకును పుస్తకముల నప్పిచ్చుచుండును. ఇట్టితరుణములం దనివార్యములగు వ్యయములను, నష్టములను, అప్పుతీసికొను భాండారమువారే భరింతురు, ప్రయాణముచేయు భాండాగారప్రతినిధులు, తెరచిన అరలరలుగనుండి మూసినచో పెట్టెవలెనుండు మూతపెట్టె బండ్లలో పుస్తకముల నుంచుకొని యూరూరికి దిరిగి చదువరుల నాకర్షించుచుందురు. చదువరులవద్ద వారేమాత్రమును డబ్బుతీసికొనరు. అట్టి గ్రంథాలయములకగు వ్యయమంతటిని విద్యాభిమానులగు ధనికులే భరింతురు. అందరును నిరభ్యంతరముగ వాని నుపయోగించుకొనవచ్చును. పోషకుల శక్తినిబట్టి గ్రంథాలయము లభివృద్ధి నొందుచుండును. వీనితరఫున నప్పుడప్పుడు పెద్దపెద్ద సభలు జరుగుటయు గలదు. అందనేకవిషయములను గురించి తెలిసినవారిచే ఉపన్యాసము లీయబడును.

ఇట్టి ప్రతి గ్రంథాలయమునకు నొక చిన్న ముద్రణా యంత్రమును ఉండును. దానితో గ్రంథాలయాధికారులు తమపని జేసికొనుటయేగాక అప్పుడప్పుడు తమ గ్రంథములను గురించియు, తమ గ్రంథాలయమునందు చదువరులకై చేయబడిన ప్రత్యేక సౌకర్యములను గురించియు ప్రకటనపత్రముల నచ్చువేసి పంచిపెట్టుచుందురు. చదువరు లెక్కువగుటకై అట్టివిషయములను వార్తాపత్రికలందు ప్రకటన జేయించుటయు కలదు.

ఇట్టి బహుజనోపయోగకరములగు గ్రంథాలయములం దేర్పాటుచేయబడు ఉద్యోగస్థులును వానికి తగినవారే అయి ఉందురు. ప్రతివాడు నట్టి గ్రంథాలయములందు జేర్చుకొనబడరు. అందలి యుద్యోగముల నాశించువారా సంబంధములగు విషయముల నన్నిటినిచదివి పరీక్షలిచ్చినవారుగ నుండవలెను. ఆదేశమునం దిట్టి విషయములను బోధించు పాఠశాలలు కొన్ని ప్రతివిశ్వవిద్యాలయమునందును గలవు. మంచి గ్రంథాలయాధికారికుండవలసిన యేసద్గుణము లేనివారి నైనను ఆపాఠశాలయందు చేర్చుకొనరు. అందుచేరినవారు సామాన్యతరగతి కొకసంవత్సరమును, పైతరగతికి రెండుసంవత్సరములును చదువవలయును. వారుద్యోగములో చేరినమీదట గుమస్తాల వలెగాక మంచిపండితులై యుండవలయును. అట్టివారికాదేశములో తగు గౌరవమును గలదు. వారికన్ని విషయములను గురించియు బాగుగ తెలిసియుండుటయేగాక, శాంతమును, పారమార్థికమునందభిలాషయు గూడనుండును. వారుదరపో

షణాకై యుద్యోగముచేయువారివలె గాక దేశోద్ధరణాకై తమ సర్వస్వమును ధారపోయ వెనుదీయని మహాత్ములవలె నిరంతరమును పని చేయుచు ఇంకను ఆగ్రంథాలయముల నెట్లభివృద్ధిచేయవచ్చునాయని ఆలోచన సేయుచుందురు. వారట్లుండుటచేతనే వారు మనమతగురువులకంటెను గౌరవింపబడుదురు.

ఇది పాశ్చాత్యదేశములందలి గ్రంథాలయములచరిత్ర. మనదేశమున నిట్టిగ్రంథాలయమొక్కటియైనను లేదనవచ్చును. మనదేశమునందిప్పుడిప్పుడే గ్రంథాలయములు నెలకొలుపబడుచున్నవి. కాని వానికిని ఈపైపాశ్చాత్యభాండాగారములకును పోలికయేమాత్రమును లేదు. మనగ్రంథాలయములుపైవానియంత పెద్దవియును, వివిధభాగములను గలిగినవియును కాకపోవుటయే గాక బాగుగ వృద్ధిజెందుటయును లేదు. దీనికంతటికి ముఖ్యకారణములు మనవారికి వానిసంగతి తెలియకపోవుటయును, తెలిసిన వారట్టివాని నేర్పరుప బ్రయత్నింపకుండుటయునై యున్నవి. మనదేశమునందు చదువనేర్చినవారే మిక్కిలితక్కువ. ఇకనట్టివారు జీవితమునందిట్టి గ్రంథాలయముల సహాయములేక నిజమగుజ్ఞానము సంపాదింపజాలక తమ అల్పజ్ఞానమును దుర్వినియోగము చేయుచున్నారు. అందుచే ముఖ్యముగ మనదేశమునందు పాఠశాలలతోపాటు సామాన్యగ్రంథాలయముల ననేకచోట్ల స్థాపించుటయేగాక అచ్చటచట నిట్టి పెద్దభాండాగారములను సయితమేర్పాటు

చేయవలయును. ఈపని అంతయు విద్యాభిమానులగు ధనికులపైనను, విద్యార్థులపైనను ఆధారపడియున్నది.

---

# ప్రకటన.

ప్రచురింపబడు విషయములు.-1 స్వార్థత్యాగము 2 మానవధర్మములు 3 కృషి, అందలిగౌరవము.

విశేషములు: గుంటుపల్లి సుబ్బారాయుడు,
రైలుపేట, గుంటూరు.
అనివ్రాసిన దెలియగలవు.

గుంటూరు వాణీముద్రాక్షరశాలయందు ముద్రితము.

"ఉద్ధరించెద దేశమే నొక్కరుడనె । నిశ్చయంబిది, సేయంగ నేర డొరుడు";
అనుచు "విలియముపి"ట్టను నతడు వలికె। అట్లెయెల్లరు దలపగనగును శుభము";

# మానసిక స్వేచ్ఛ.

ఏవిషయమును గురించియైనను కారణయుక్తముగ నాలోచించి ఒక యభిప్రాయము నేర్పరచుకొనగలవాడు మానసిక స్వేచ్ఛ గలవాడనిపించుకొనును. తనకంటె పెద్దవారనియో, యెక్కువ విద్యావంతులనియో, ఇతరుల అభిప్రాయములనే యెల్లప్పుడును తన అభిప్రాయములకు మారుగ గలిగియుండువానికి మానసిక స్వేచ్ఛ లేదు. అట్టివాడూరక ఇతరులుచూపిన మార్గములనే అవలంబింపవలసి యుండును. అందుచే నాతని జ్ఞానచక్షువులేని గ్రుడ్డివాడనవచ్చును.

జ్ఞానమునందపేక్ష మానవులకు పుట్టుకతో నుండును. "మండిగముమీదకూర్చొని తుమ్మకూడ"దను తల్లిని "తుమ్మిన నేమగు"నని అయిదారేండ్ల బాలుడు ప్రశ్నించును. అట్లు తుమ్మిన నేమగునో తెలిసికొనవలయుననియే యాతని అపేక్ష. అట్లే "ఇది ఇట్లొనర్చిన నేమగు"ననియు, అది యట్లగుట కేమి కారణమనియు బాలకు లెల్లప్పుడును బ్రశ్నించుచుందురు. పసితనమునుండియు అన్నివిషయములను తాము గ్రహింపవలెననియే మానవుల కోరిక. కాని "నీకాసంగతితో పని లేదు ; నీవట్లొనర్పగూడ"దని బాలుని గట్టిగ గద్దించినచో నాతడు మరల బ్రశ్నింపడు. ఇట్లు కొన్ని సంగతులను తెలిసికొనగోరి అడిగియడిగి తగు సమాధానములకు బదులు చీవాట్లను, ఉ

త్తర్వులను బడసిన బాలకునకు క్రమేణ కారణమునం దపేక్ష నశించును. కొంతకాలమైనపిమ్మట నాతడును, ఏకారణమును చెప్పజాలకపోయినను ఇతరబాలకులకు మండిగముపైనుండి తుమ్మగూడదని బోధింపసాగును. ఈవిధమున బాలకునకు మొదటినుండియు మానసికస్వేచ్ఛ నశించుచున్నది. ఇట్టి అవస్థయందుండగనే ప్రపంచజ్ఞానమేమాత్రమైనను గలవారు నమ్మజాలని పిచ్చికథలను సయితము పసివారగు బాలికాబాలకులు నమ్మి భయపడుచుండుట తటస్థించుచున్నది. ఆతరుణమునందు బాగుగ మనమున నాటిన దయ్యముల చేష్టలును, విపరీతపు టభిప్రాయములును మరల నెన్నియో సంవత్సరములకు గాని మనస్సులనుండి పోవు.

పసితనమున నీవిధమున పెంపబడుట చేతనే మనుజులలో ననేకులు మానసికస్వేచ్ఛను గోల్పోవుచున్నారు. కొందరు మతవిషయములందును, కొందరు సాంఘిక విషయములందును, కొందరు రాజకీయములందును, మరికొందర న్నివిషయములందును తామేమాత్రము నాలోచింపజాలక ఇతరుల అభిప్రాయములనే అనుసరింతురు. కొన్ని విషయములను గురించి అనేకుల యభిప్రాయము లోకవిధముననే యుండవచ్చును కాని ఆయభిప్రాయము కలిగియున్నవారందరును అందుకు గలకారణములను మాత్రము తెలిసికొని యుండవలయును. ఆయభిప్రాయము మొదట మరియొకరిదైనను గూడనప్పుడది తనదేయని ప్రతివాడును అనుకొనవచ్చును.

భౌతికశాస్త్రములను, చరిత్రలను చదివి వానివలని ఫలితముల నందగలుగుటకు ముఖ్యముగ మానసికస్వేచ్ఛ యుం

డవలయును. కారణములకును వాని ఫలితములకును గల సం
బంధములను గ్రహించుటయే భౌతికశాస్త్ర పఠనమునందలి
ముఖ్యాంశము. సరియగు కారణములను గ్రహింపగలిగిననే
కాని శాస్త్రములందలి అన్ని విషయములును బాగుగ తెలియ
జాలవు. భౌతికశాస్త్రములయం దన్ని సంగతులను గురించియు
విపులముగ చర్చించి వ్రాయబడిన గ్రంథము లిపుడెన్ని దొరకి
ననుగూడ; పాఠశాలలయందు మరల-బాలురు ప్రతి విషయ
మును స్వయముగ పరిశీలించి తోచిన యభిప్రాయముల నే
ర్పరచుకొనుటకై తగునేర్పాటులు చేయబడియున్నవి. ఉపా
ధ్యాయులు బాలురకు మొట్టమొదట వస్తుతత్వపరిశీలన మె
ట్లొనర్పవలయునో బోధించి పిమ్మట వారివారి యభిప్రాయ
ము లేర్పరచుకొనునట్లొనర్తురు. అయినను అందరు బాలురు
నొకవిధముననే సరియగుపద్ధతిని బరిశీలనమొనర్చుటచే నంద
రును తప్పక ఒక అభిప్రాయమునకే వత్తురు. చరిత్రలను
నేర్చుకొనుపట్లను ఇట్లే మానవులు తమ స్వాతంత్ర్యము
నుపయోగింపవలయును. సామాన్యముగ చరిత్రలయందు
వివిధదేశములకును ప్రభువులకును సంబంధించిన సంగతులు
జరగినట్లుగ వ్రాయబడియుండును. ఎట్టివాడైనను వాని న
న్నిటి ననేకసారులు పఠింపవచ్చును. కాని ఏదేశచరిత్రయం
దైనను అప్పుడా ఘోరయుద్ధములు సంభవించుట కేమికారణ
మై యుండునాయని కాని స్థితిగతు లాతీసనున్న ఆదేశమున
నిక నెట్టిమార్పు లేర్పడుననికాని ఆలోచించి తెలిసికొనగలుగు
టకు సునిశితమగు బుద్ధివైశద్యమే కావలయును. అట్టి విష
యములందు స్వేచ్ఛగ ఎవనికి వా డాలోచించి "ఇది ఇ"ట్లని

అభిప్రాయపడవలసినదేగాని యొకరిపై నాధారపడగూడదు. అట్లాధారపడువా డేమాత్రమును చరిత్రలను నేర్చికొని నందువలని లాభము నొందజాలడు. స్థితిగతులనుబట్టి ఫలితములను, ఫలితములనెరిగి కారణములను స్వాయముగనాలోచించి కనుగొనగలవాడే మంచిచరిత్రజ్ఞానముకలవా డనిపించుకొనును.

ఇక మతసాంఘికవిషయములందును మానవులు ముఖ్యముగ మానసిక స్వేచ్ఛను కలిగియుండవలయును. సాంఘిక నియమము లేకాలమున కెటులుండవలసినదియు ప్రతివానికిని తెలిసియుండవలయును. అన్నిటికంటెను ముఖ్యములగు మత విషయములందు, పురుషులకును స్త్రీలకునుగూడ మానసిక స్వేచ్ఛయుండుట అత్యావసరము. ప్రతిపురుషునకును స్త్రీకిని ఈమతసాంఘికవిషయములను గురించి ఇప్పుడేవియో కొన్ని యభిప్రాయములు లేకపోలేదు. వారు వానినే వ్యతిరేకముగ నెన్ని కారణము లగుపడుచున్ననుగూడ, మొండిచరచి బలపరచుటయు కలదు. కాని వారేల ఆయభిప్రాయములను కలిగియుండవలయునో, వారిలో ననేకుల కేమాత్రమును తెలియదు. కొందరది శిష్టాచారమనియు, కొందరవి వారిపూర్వులా విషయములను గురించి వ్రాసియుంచిన అభిప్రాయములనియును, మరికొందరు వాని నొల్లనిచో పాపము వచ్చుననియు నొన్నియభిప్రాయములను కలిగియున్నారు. ఇది మానసిక స్వేచ్ఛ గలిగియుండుటకు లక్షణముకాదు. ఏవిషయమును గురించియైనను తప్పో, ఒప్పో అగు ఎవని అభిప్రాయమును వాడు కలిగియుండిన, నేమాత్రమును పాపమురానేరదు. అట్లుగాక పాపమువచ్చునను నెడల పశువులకు లేక, మానవులకుమాత్ర

మున్న వివేచనాజ్ఞానము మానవుల కెట్లుపయోగ కారియో చెప్పవలసివచ్చును. ఇకనివి విద్యావంతులగు మన పూర్వుల యభిప్రాయములనినచో నట్టివి వారికాలమునకు సరిపడియుండవచ్చును. అంతియగాక నవి ఇప్పటికిని సరిపోవునవే అయిన యెడల వానికిగల కారణముల నెరిగి మనము వానిని గ్రహింపవచ్చును. వానికిగల కారణములు మనకుదొరకకగాని, అవి మనకాలపువారి కర్థముకాకగాని యుండినచో, అట్టి యభిప్రాయములను మనమేమాత్రము గ్రహింపతగదు.

సాంఘికాచారములను గురించి సంఘమువారందరు నొక విధమగు నభిప్రాయములనే కలిగియుండుటెంతయు శ్రేయోదాయకము. మరియు సంఘమువారందరును కారణముల నుగ్రహించి, యేఅభిప్రాయములనైన కలిగియుండవచ్చును; కాని ఎవ్వరును, తమకు మంచివనితోచిన మాత్రమున తమఅభిప్రాయములనే తమ సంఘమువారెల్లరు కలిగి యుండవలయునని శాసింపకూడదు. ఇదియే మనమిప్పుడు ముఖ్యముగ నేర్చుకొనవలసిన సంగతి. జనులిప్పుడు ముఖ్యముగ మతవిషయములం. దేమాత్రమును తమబిడ్డలకు మానసిక స్వేచ్ఛ నొసంగుటలేదు. ప్రతివానికిని తానేమతమునకు చెందినవాడైన తనబిడ్డలును తప్పక నామతమునందే నమ్మికగలిగి యుండవలయునని యే అభిప్రాయము. తనకన్నిటికంటె ఆమతమే యుత్కృష్టమని తోచుటచే దనబిడ్డలును దానినే యవలంబింపవలెనను కోరిక యొకవిధమున మంచిదేకావచ్చును. అయినను అట్లనుకొనుటలో నాతడేమాత్రమును తనబిడ్డలకును దనకువలె అంతరాత్మయు, మంచిచెడ్డల నెరుగగల జ్ఞానమును కల

వనుమాటను జ్ఞాపకముంచుకొనుట లేదు. పసితనమున తనబి డ్డలకు మంచిచెడ్డల నెరుగగలజ్ఞానము బాగుగ నుండదని యా తడనుకొనినను తప్పులేదు. అట్టి తరుణమునందు వారికి తనమ తమునంతటిని బాగుగ బోధించినను బోధింపవచ్చును. కాని వారికది యొకటియే బాగుగబోధించి అన్యమతగ్రంథముల నే మాత్రమును తాకనీయక, కనుపెట్టుకొనియుండుటమాత్రము తగదు. వారికప్పుడన్ని మతములను వీలగువరకును తెలిసికొన సాధ్యమై యుండవలెను. వారు వానివిషయమై అభిప్రాయ ముల నేర్పరచుకొనుటలో దానును వారికి సాయముచేయ వచ్చును. కాని వారిమార్గములన్నిటి నరికట్టి మీరీ మతము నే అవలంబింపవలయునని నిర్బంధింపజనదు. అది అమానుష ము. అయినను దానికి జంకువారరుదు.

గ్రంథములను జదువుటయందును, వానిపై దమకుగల అభిప్రాయము లొసగుటయందునుగూడ, మనలో ననేకులు మానసికస్వేచ్ఛను కలిగియుండక ఊరక అన్యుల ననుకరింతు రు. అల్పవిద్యావంతులును, సామాన్యులు, నిట్లొనర్చుట వా రి తెలివితక్కువ నెరుకపరచును. విద్యావంతులును గొప్ప వారునగువార లట్లొనర్చుట వారి సోమరితనమును, భయము ను తెలియజేయును. ఏగ్రంథమునుగాని పూర్తిగా జదివి యందలి విషయముల నవగాహనపరచుకొననిదే విద్యావం తులైనను, తమ అభిప్రాయములను, ఆగ్రంథముపై నిత రులిచ్చిన అభిప్రాయముల ననుసరించి వ్రాయగూడదు. అట్లే తమకు బాగుగదెలిసిన గ్రంథమునుగురించి అన్యు లెట్ల నుకొనినను, తమ అభిప్రాయములను తాము నిర్భయముగ

వెల్లడింపనగును. ఒకటి రెండు సందర్భములలో తమ అభిప్రాయము తప్పై తరువాత మార్చుకొనవలసివచ్చినను అందుకు వెనుతీయకుండుటయే గొప్పవారి లక్షణము. ఇదియే మన విద్యాధికులలో ననేకులిప్పుడు పాశ్చాత్యవిద్యాధికులనుండి నేర్చుకొనవలసిన నీతిపాఠము. మనవారిలో కొందరి కింకొక దురభ్యాసమును కలదు. తాము విద్యావంతులగుటచే, నెల్లప్పుడును తమకందలి భావములర్థముకాకున్నను. వెనుకటి కవులను వారి గ్రంథములను ఊరక పొగడుచు, ఇప్పటివారి గ్రంథములెట్టివైనను వానికి దీసిపోవునని చెప్పుచుండుటయే తగునని తలచెదరు. మరికొందరెల్లప్పుడును అన్యుల అభిప్రాయములను కాదనుటచేతనే తమ యాధిక్యతను నిల్వబెట్టుకొన జూతురు. ఇట్టివారిలో నెవ్వరికిని మానసిక స్వేచ్ఛ యేమాత్రమును లేదనియే చెప్పవచ్చును. ఇట్లే మనదేశమున నిప్పుడనేకమంది ధనికులును నలుగురు పెద్దమనుష్యులు సాయముచేయు సత్కార్యములకే తామును విరివిగ సహాయమొనర్చుచు, క్రొత్త పనులెంత మంచివైనను వాని యుత్కృష్టతను అణుమాత్రమైనను గ్రహింపకనే, దానకర్ణులనిపించుకొనుచున్నారు. ఇవన్నియు నిప్పటి మన విద్యాధికులును ధనికులునగువారి కేమాత్రమును మానసికస్వాతంత్ర్యము లేదని తెలియబరచును. ఇంగ్లాండు, అమెరికా మొదలగు పాశ్చాత్యదేశములందలి విద్యావంతులును ధనికులును అనేకులీవిషయమున నిట్లు ప్రవర్తింపరు. అదియు వారిదేశౌన్నత్యమున కొక ముఖ్యకారణమే.

స్వేచ్ఛగ దమకుదామాలోచింపక అన్యులనుజూచి యెంతమంచికార్యము లొనర్పబూనుకొనినను అందలి మంచి

చెడ్డలును, అవసర, అనవసరములును బాగుగ తెలియజాలక అనేకులాపనుల కొనసాగింపజాలకున్నారు. పుస్తకభాండాగారములను పాఠశాలలను ఏర్పరచి ఇతరులవలెనే కీర్తిని సంపాదింపనెంచిన అనేకులు, అవసరములేనిచోట్లనో, అదివరకే కొన్ని యున్నచోట్లనో వానినేర్పరచి పూర్వపువానినిగూడ పాడుచేయుట కొన్నిచోట్ల తటస్థించుచున్నది. పట్టణములలో పేటకొకటికి రెండుచొప్పున నేర్పరుపబడి, యొకదానను నూరు పుస్తకములైననుండని లైబ్రరీ లిందునకు తార్కాణములు. కావున వానిని స్థాపింపనెంచువార లందలి ముఖ్యోద్దేశముల నెరిగి, అవసరమున్నచోట్ల తగువిధమున, నేర్పరచిన అవెంతయు లాభకారులగుననుట కేమాత్రమును సందియముండదు.

---

## ప్రకటన.

---

విశేషములు.—యేటుకూరు భోగిరాజు, అరండల్ పేట, గుంటూరు.
అని వ్రాసిన తెలియగలవు.

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె. 1915.

గీ॥ "ఉద్ధరించెద దేశమే నొక్కరుడనె । నిశ్చయంబిది సేయంగ నేరడొరుడు"
అనుచు "విలియముపి"ట్టను నరుడు పలికె। అట్లె యెల్లరు దలపగ నగును శుభము॥

# కృషి - అందలి గౌరవము

మనుజునకు కావలసిన వస్తువు లన్నియు నీలోకమున నెచటనో, ఏదో ఒక రూపమున దొరకును. కాని వానిలో నే చిన్నవస్తువయినను అతని ప్రయత్నము లేనిదే మనుజునకు లభింపదు. ఆకలిదీర్చుకొనుట కాహారమును, దేహముగప్పుకొనుటకు వస్త్రములును, ఎండవానల కాగగలుగుట కిండ్లునుగూడ మనుజున కీలోకమున లభింపగలవు. అయితే వాని నాతడితర వస్తువుల సాయముచే నేర్పరచుకొనవలయును. మనుజునకు తెలివి హెచ్చినకొలదిని కోరికలును హెచ్చుగుట సహజము. కావున కాలముగడచినకొలది మానవున కనేక సౌకర్యముల నేర్పరచుకొనవలెనను అభిలాషజనించును. వానికొరకై యాతడేమాత్రమును వెతకబనిలేదు. వివిధములగు రుచుల నొసగు ఫలములును, కావలసినవిధమున వస్త్రముల నేసికొనగలుగుటకు ప్రత్తి, ఉన్ని మొదలగు వస్తువులును, ఇష్టమువచ్చినరీతిని ఇండ్లు వాకిళ్ళు నేర్పరచుకొనుటకు కఱ్ఱ, రాయి మొదలగు సామానులునుగూడ నాతనికి దొరకకపోవు. ఇన్నివస్తువులీవిధమున దొరకిననుగూడ మానవుడు తనకుదాను శ్రమపడి తగు పదార్థములను సేకరించి కావలసిన వస్తువులను తయారుచేసికొననిదే యవి అమర్చి యాతనికై సిద్ధముచేయబడవు.

మానవుని అవయవనిర్మాణమును అతనికున్న శక్తిని కొంచెముగ విచారించిచూచితిమేని మరల నాతనిగురించి మనకీయభిప్రాయమే ఏర్పడును. జంతువులన్నిటికున్నట్లు బ్రతుకుటకత్యావశ్యకములగు, అన్నకోశము, హృదయము మొదలగు అవయవములుమాత్రమేగాక మనుజునకు తక్కిన జంతువులకులేని చేతులునుగలవు. జ్ఞాపకశక్తియు, వివేచనాజ్ఞానమునుగూడ మనుజునకేగలవుగాని పశువులకులేవు. వీని నన్నిటిబట్టి జూచినను కూడ మనుజుడు ప్రత్యేకము శ్రమపడియే జీవింపగలుగునట్లేర్పాటని మనకు తోచకమానదు.

“ఉద్యోగం పురుషలక్షణ”మ్మను లోకోక్తి మనకీయర్థమునే స్ఫురింపజేయును. సర్వదా ప్రయత్నించుచు శ్రమపడుచుండుట మానవుని ముఖ్యచిహ్నమని అందలిభావము. కావున నట్లెల్లప్పుడు ఏదయిన నొకవిషయమునుగురించి ప్రయత్నముచేయుచుండక, సోమరియై కాలముగడపువాడు మానవులకుండవలసిన సహజలక్షణములేనివాడని మన మనుకొనవచ్చును. ఇది గ్రహింపక మనవారిలో ననేకు లీసామెతయందలి “యుద్యోగ”మను మాటకు ప్రభుత్వోద్యోగమని యర్థముచేసికొని, సర్కారుద్యోగము చేయుటయే మగవానికి ముఖ్యలక్షణమని భావించుచున్నారు.

పైవిషయమునుగురించి శ్రద్ధతో ఆలోచించినవారెవ్వరును వడలువంచిపనిచేయుట యేవర్ణస్థునికయినను తగదనియు, అందుచే నాతనిగౌరవమునకు లోపముకలుగుననియు జెప్పజా

లరు. మానవులలో నొక్కొకడు తనకుగావలసిన పనులన్ని
టినొనర్చుకొనినను సరియే, లేకున్న మనుజులందరుగలసి తమ
కందరకును గావలసిన పనులను, తలకొకకొన్నిటిచొప్పున చే
సికొనినను సరియే. కాని ప్రతివాడును తనకుగావలసినవాని న
న్నిటిని తానే సమకూర్చుకొననెంచిన, నది అసాధ్యమగును.
అందుచేతనే కొందరు మనుజులు గుడ్డలు నేసిన కొందరు
భోజన సామాగ్రుల తయారు చేయుదురు; కొందరు ఇం
డ్లు వాకిండ్లు గట్టిపెట్టిన కొందరు పాత్ర సామాగ్రులు చేసి
యిత్తురు. ఈవిధమున మానవజాతియంతయు, ఒకదేహ
మునందలి అవయవములన్నియు గలసి దేహమంతటి పోషణ
కై పాటుపడునట్లే, తమఅందరి సౌఖ్యమునకునై పాటుపడ
వలయును. ఈపద్ధతి మానవ సంఘమున కంతటికిని మి
క్కిలి శ్రేయోదాయకము. దీనినవలంబించిన దేశీయు లభివృద్ధి
నందగలుగుదురు. పూర్వకాలమున మన హిందూదేశమున
వర్ణభేద మీయభిప్రాయముతోనే యేర్పరచబడినదని అనేకు
లు తలంచుచున్నారు. ఆకాలమున మన దేశీయులలో ప్రతి
కులమువారును తాము తయారుచేయగలవస్తువులను దేశీయు
లందరికొరకై తయారుచేయుచుండెడివారు. అప్పుడు బ్రాహ్మ
ణులు మతవిషయమునను, వైశ్యులు వ్యవసాయవిషయమున
ను, శూద్రులలో నొక్కొక్కతెగవా రొక్కొక్కపనివిషయ
మునను తమదేశ మన్యదేశముల కేమాత్రమును దీసిపోకుండు
టకై ప్రయత్నించెడివారు. అయినను అప్పు డేవర్ణములోని
వాడయిన నొకడు తనకులవృత్తియం దంతగ దన కిష్టము లేక

పోయెనేని వెంటనే తనకిష్టమువచ్చిన మరేయితర వృత్తినైన నవలంబించుటకలదు. అటుపై నాతడావర్ణస్థుడుగనే భావింపబడుచుండెను. అందుచే ఆ కాలమున ఇప్పటివలెగాక విద్యావంతుడును తపస్సంపన్నుడు నగువాడు ఏవర్ణస్థుడైనను మహార్షి యగుటయు, విద్యావిహీనుడును, దుర్మార్గుడునునగు బ్రాహ్మణుడు సయితము పతితుడై ఛండాలురతో జేరుటయు సంభవించెడిది. దీనివలన నప్పటివర్ణభేద మిప్పటివలె అర్థరహితముగను అతి కఠినముగను ఉండలేదని మన మూహించుకొనవచ్చును.

దేశాభివృద్ధికొరకు ప్రజలలో నేపనికి తగినవా రాపని నొనర్చుచు సోమరులుగాకయుండుటే అప్పటివారి ముఖ్యోద్దేశము. ఇప్పుడన్ననో ఆయభిప్రాయముకలవారలొకరిద్దరే. అవిద్యావంతమగు మన జనసామాన్యమునకును, అం దచ్చటచ్చట నొకరిద్దరుగనుండు మన విద్యాధికులలో ననేకులకునుగూడ కృషియన నేమియో, అందలి గౌరవమెట్టిదో ఏమాత్రమును తెలియదు. మనవారలందరు నిప్పుడేమాత్రమును కష్టపడకనే ఎట్లు సుఖముగనుండవచ్చునా యని ఆలోచించువారు. అందువలననే ప్రతివృత్తియందును మోసము ఇనుమడించుచున్నది. వ్యవసాయముచేయువారు తాముపండించుధాన్యములో మట్టిని, బెడ్డలునుకలిపి లేనిధాన్యమునకు వెలబుచ్చుకొనిన, బెత్తకొకపోగుగ నేసి సాలీలు డబ్బు గణించుచున్నారు. కాని వీరిలో నెవ్వరునుగూడ మే మన్యాయముగ గడించినడబ్బన్యాయముగ నేపోవుచున్నదిగదా; పైన మన గౌరవమును

గూడ నేల పోగొట్టుకొనవలెనని తలచరు. ఒకవేళ నిట్లొకరి ద్ద రనుకొని తమవృత్తియందు తాము న్యాయార్జనముచేతనే జీవింపవలెననుకొనినను, తక్కినవా రెప్పటియట్లే ఉండినంత కాలమును వారి న్యాయమునకు ప్రతిఫలముగ నష్టమే ప్రాప్తించును. "ఈకాలమున న్యాయమునకు కూడులే"దను సామెతవలన నీ సంగతి బాగుగ తెలియగలదు. దీని కంతటికిని సోమరితనమును, పనిచేయుటయన చులకనగ జూడబడుటయు కారణములు. తక్కినదేశము లీవిషయమున నింత అన్యాయముగ లేవు. ఆదేశములం దనేకులకు కష్టపడనిదే ఫలముకలుగదని బాగుగ తెలియును. మనదేశమునందువలె నచట సోమరులు పొట్టబోసికొనగలుగుట కుపాయములులేవు. ఈదేశమునవలె నిక నెచ్చటనుకూడ నిచ్చకములాడు టక్కరులకును, సంచారముచేయు బ్రాహ్మణులని యాచించు సోమరులకును, యాయవారముచేసి జీవించుటయే తమకు వ్రాసిపెట్టబడినదను వంచకులకును, కొందరి కితరవృత్తులవలె తమకు భిక్షాటనమే వృత్తియను నజ్ఞానులకును, దానధర్మములకని ధనవ్యయ మొనర్చు నక్షరజ్ఞానశూన్యులగు ధనికులు లేరు. అంతియగాక ఆదేశములలో నెందునుగూడ మన హిందూదేశమునందును, ముఖ్యముగ మన తెలుగుజిల్లాలయందునువలె నల్పవిద్యావంతులును, సోమరులును, మోసగాండ్రును నగు బ్రాహ్మణబ్రువులు లేనికయ్యములను కల్పించి వ్యవహారములకొరకను దాంభికనామముతో కచ్చేరుల కెక్కించి విద్యావిహీనులును, పశుప్రాయులు నగువారివద్ద వందలకొలది ద్రవ్యమును గడిం

చుట కణుమాత్రమును విలులేదు. అట్టివారాదేశములో నేర్ప డక పోవుట కచటి ప్రజలందరును విద్యావంతులును, అచటి న్యాయవాదులు క్రమప్రవర్తనగలవారును అగుట ముఖ్యకారణము. అందుచే నాదేశములలో ప్రైవేటుచే జీవింపనెంచిన వారు ఊరక ఉడికించినమాత్రమున నుడికిపోవు పార్టీలుగాని, పార్టీలిచ్చుఫీజులో భాగమిచ్చువకీళ్లుగాని దొరకక మాడి చావవలసివచ్చును.

ఈకారణములవలననే తక్కిన దేశములలో నేవృత్తియందయినను న్యాయశీలుడును, మిక్కిలి పరిశ్రమ చేయిగలవాడును అగువాని కెక్కువగౌరవముకలదు. మనదేశమున నట్లింతమాత్రమునుకాదు. ఎంతటిధనికుడయినను, ఎంతశరీరకష్టముచేయువాడయినను వ్యవసాయదారు డెఱ్ఱని యెండలో మాడవలసివచ్చుటచే నాతనికంటెను కొంచెము తెల్లకాగితమును నల్లచేయగలిగి నీడపట్టునకూర్చొని ఏవిధమునయిన డబ్బుసంపాదింపగల బ్రాహ్మణుడే పెట్టిపుట్టినవాడనియు నందుచే నాతడెక్కువ గౌరవపాత్రుడనియు ననుకొనుట మనవారికి మామూలయినది. ఇదియేమాత్రమును సరియగు నభిప్రాయము కాదు. ఏలయన సంఘమున కవసరమగు నుద్యోగము చేయువారయిననేతప్ప, ఊరక తెల్ల కాగితములను ఫోర్జరీవ్రాతలతో నల్లజేసి జీవింపగల బ్రాహ్మణు లెంతతగ్గిన దేశమంత అభివృద్ధినొందగలదు. కాని కష్టముచేయగల వ్యవసాయదారులుకాని, అన్యాయముచేయని వర్తకులుకాని, మరియేయితర సద్వృత్తులవారయినగాని, వారిదివరకు పెట్టిపుట్ట

నివారని మూర్ఖులనుకొన్ననుసరియే, ఎంతవృద్ధియైనదేశ మంత అభివృద్ధినొందును. అట్లే వారెంతక్షీణించిన దేశ మంతక్షీణించును. కాన నట్టి కృషికులును, వడలువంచి పనిచేయగలవారలును, సోమరులును, అక్రమప్రవర్తకులు నగు మరి యేయితరకులస్థులకంటెనుగూడ గౌరవనీయులును మహాత్ములునని గట్టిగా జెప్పవచ్చును. అట్టివారనిన నితరదేశములయందు గౌరవము నొందు. అది లేకపోవుటే మనదేశపుదుస్థితికంతటికిని మూల కారణము.

ఇక కష్టించి పనిచేయువారలలో ఏవృత్తివారెక్కువయని మన మాలోచింపబనిలేదు. దేశక్షేమకరములగు అన్నిసద్వృత్తులునుగూడ మంచివే. ప్రభుత్వోద్యోగములయందుండువారు న్యాయశీలురయిన దేశమునకు రాజకీయవిషయమున నెంతలాభముకలుగునో, వ్యవసాయదారులును, వర్తకులు, కుమ్మరులు, కమ్మరు లాదిగాగల తక్కినవృత్తులవారునుగూడ క్రమప్రవర్తనగలవారయిన నాయావిషయముల దేశమునకు అంతలాభమును కలుగగలదు. క్రమప్రవర్తనయు, న్యాయబుద్ధియు అన్నివృత్తులవారికిని అవసరమే. అవి విద్యవలనను సత్సాంగత్యమువలననుమాత్రమే అలవడగలవు. అంతియగాక, విద్యయును శాస్త్రజ్ఞానమును లేనివా డేవృత్తియందయినను వృద్ధిలోనికి రాజాలడు. అందువలననే తక్కిన దేశములందు అన్నివృత్తులును విద్యాధికులచేతులలో నభివృద్ధినొందుచుండ మనదేశములో నజ్ఞానులబారిబడి నశించుచున్నవి. విద్యావిహీనులగు మన సేద్యగాండ్రిరువదియకరములలో పం

డింపగలపంట, వ్యవసాయశాస్త్రమునభ్యసించిన పాశ్చాత్య కృషీవలు లొకయకరమున నే పండింపగలుగుచున్నారు. అట్లే అరచేతిమందమున, ఆరునెలలకు మనసాలీలునేయగలంత పోడవుగుడ్డను, ఉల్లిపొరవలె అరనిమసమున అయిదారేండ్ల బాలుడు యంత్రసహాయమున నేయగలుగుచున్నాడు. అయితే వెనుకటికాలములో, అతినాజూకుగ పనులనొనర్పగలిగి ప్రఖ్యాతివడసిన పనివాండ్రెందరో మన దేశమున నుండిరనియు, వారిపనులము దిప్పటియంత్రపుపను లాగవనియు కొందరనవచ్చును. అట్టిపనివా రతిస్వల్పసంఖ్యాకులుగమాత్ర ముండగలరు. అట్లుండిన, వారెంతయు ప్రశంసాపాత్రులని చెప్పక తప్పదు. కాని వారు ప్రజలకు గావలసినపనిముట్లను, వస్తువులను అన్నిటిని తయారుచేయజాలరు. అందుచే త్వరగను, సులభముగను వస్తువులను తయారుచేయుటకు శాస్త్రజ్ఞానమును, ఆయావిద్యలయందు పాండిత్యమును బాగుగ నుండవలయును. నిపుణులగు పనివారగుటకుకూడ, ఆయాపనులకు సంబంధించిన జ్ఞాన మెంతయో కావలయును. కావున శరీరకష్టముతో కూడిన ప్రతిపనియునుగూడ గౌరవనీయమైనదేయనియును, సోమరులై కాలముపుచ్చుటకంటెను, దుర్మార్గులై పరులమోసగించుటకంటెను, ఎంతకష్టముతో కూడుకొనినదయినను ఒకవృత్తి నవలంబించి జీవించుటయే ఆత్మగౌరవముగలవానికి లక్షణమనియును మనవారు గ్రహింపవలయును.

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె. 1915.

గీ॥ ఉద్ధరించెదదేశమే నొక్కరుడనె । నిశ్చయంబిది సేయంగ నేరడొరుడు
అనుచు "విలియముపిట్టు"నతడువలికె । నట్లెయెల్లరుదలపగనగునుశుభము ॥

# అన్యమతసహనము

క౦॥ వినదగు నెవ్వరు సెప్పిన । వినినంతనె వేగపడక వివరింపదగున్
కనికల్లనిజము దెలిసిన । మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ ॥

మానవచరిత్రమును పరిశోధించిన యెడల ఒకస్థితిలోనుండి మఱియొకస్థితిలోనికి మార్పులేక పరిణామము ప్రధానాంశముగ గనబడుచున్నది. కాలము మారినకొలదిని నవీనాభిప్రాయములును నూతనవిషయములును మానవుల మనముల ప్రవేశించుచున్నవి. ఏ క్రొత్తవిషయమునైనను, అందలి మంచిచెడ్డల బరిశీలింపకముందే నిరాకరించుట మానవున కలవాటైయున్నది. క్రొత్తయభిప్రాయము లెంత సహేతుకములైనను, సామాన్యజనులచే విపరీతములుగ బరిగణింపబడుటయు, వారిచే నిందింపబడుటయు అనుభవవేద్యము. మనము జీవించు ఈకాలమునకూడ నొక నూతనయుగము ప్రారంభమై విజృంభింప మొదలిడినది. అందుచే నిచ్చటి జనులు భిన్నాభిప్రాయులగుటయు, పూర్వాచారపరాయణులు నవీనాచారపరులను, నవీనాచారపరులు పూర్వాచారపరాయణులను, నిందించుటయు సంభవించుచున్నవి. అనగా ఇప్పుడు మనదేశములో అన్యాభిప్రాయసహనమనునది లేశమైన గన్పట్టుటలేదు.

అన్యమతసహనమనిన అన్యుల యభిప్రాయములు స్వాభిప్రాయములకు విరుద్ధములైనను ఏమాత్రమును విచారింపకనే వాని నవలంబింపవలయు ననుట కాదు. మొట్టమొదట సంఘవిషయికమగు పరాభిప్రాయసహనమును గూర్చి విచారింతము. ప్రస్తుతము ఋతుమతీవివాహము, స్త్రీపునర్వివాహము మొదలగునవి హైందవహృదయమున కాందోళనమును కలిగించుచున్న వివాదాంశములై యున్నవి. స్త్రీవిద్యయు వేశ్యానిరోధమునుగూడ నీ తెగలోనివే. ఈవిషయములనుగూర్చి జనులు పూర్వాచారపరాయణులు, సంఘసంస్కర్తలు, అనబడు రెండుతెగలుగ విభజింపబడి యున్నారు. పలువురొకచో సమావేశమైనపుడును, పత్రికాముఖమునను, వీనినిగూర్చిన చర్చలు జరుగునపుడు ఇరుపక్షములవారును, ఒకరినొకరు అతినీచముగ నిందించుకొనుట యిప్పుడు సర్వసామాన్యమైనది. కొన్ని సమయములందు విద్యాధికులలో సయితము దూరదృష్టియు అన్యమతసహనమును లేకుండుటచే మనస్పర్ధలుగూడ గలుగుచుండుట మనమెరుంగనిది కాదు. ఎంతటి విద్యావంతులైనను పరాభిప్రాయసహనమును గలిగియుండనిచో నిందాపాత్రులగుచున్నారు.

ప్రతివానికిని ఏవిషయమునుగూర్చియైనను స్వేచ్ఛగ నాలోచించి సహేతుకమగు అభిప్రాయము నేర్పరచుకొనుట కధికారము కలదు. అయినను అన్యులయభిప్రాయములు తనకెంతవిపరీతములుగ దోచినను దానికై యితరుల నిందింపక వారియెడ సానుభూతిని గనుపరుప నాతడుబద్ధుడైయున్నాడు.

పరాభిప్రాయసహనము లేకుండుట మూర్ఖత్వమును మో టూదనమును చాటుచున్నది. పరాభిప్రాయసహనమే నిజమగు నాగరికతకు లక్షణము. అట్టి సహనము లేనిమనుజు డెంతవి ద్యావంతుడైనను, అతనివిద్య నిష్ప్రయోజకము. ఇతరుల యభిప్రాయములు తన యభిప్రాయములకు ప్రత్యక్షవిరుద్ధము లుగ నుండినను వానియెడ తగు గౌరవమును గనబరచుటయు వానిని తానంగీకరింపజాలనిచో నట్లని మర్యాదపూర్వకముగ దెలియజెప్పుటయు మాత్ర మతనికి తగియుండును.

ఇక మతవిషయకమగు పరాభిప్రాయసహనమునుగూర్చి కొంచెముగ విచారింతము. ఈసందర్భమున అన్యమతసహన మనగా తానవలంబించు మతముకంటె నన్యునిమతము వేరు గను విరుద్ధముగగూడనున్నను అందులకై వానిని నేవగించుకొన కుండుటయు, తనమతము నవలంబింపుమని వానిని నిర్బంధింప కుండుటయునై యున్నది. అన్యమతద్వేషము నెన్నడును వి ద్యావంతుడు కనబరుపడు. అయినను తనమతమే సహేతుక మైనదనియును, అన్యునిమతమేమాత్రమును కారణయుక్తముగ లేదనియును తోచినపుడు తన మతమునందుగల సహేతుకత్వ మతనికి తెలియబరచి, ఒప్పించి, తనమతమునవలంబింపజేయు ట తప్పని చెప్పరాదు సరిగద, అది పరోపకారపారీణులగు వి ద్యావంతులందరును చేయవలసిన పనియునై యున్నది.

అన్యమతద్వేషము అనేకసంక్షోభములకును, దేశారిష్ట ములకును మూలకారణమని ప్రపంచచరిత్ర ఉద్ఘోషింపుచు న్నది. ఐరోపాఖండముయొక్కయు, ముఖ్యముగ నింగ్లాండు

యొక్కయు పదియారవశతాబ్దమునందలి చరిత్ర నెక్కింత పరిశీలించితిమేని, ఈవిషయము సుబోధకము కాగలదు. ఆ కాలమున క్రైస్తవమతస్థులు ప్రాచీనమతావలంబకులగు రోమను కాతలిక్కులును నూతనమతావలంబకులగు ప్రొటెస్టెంట్లును అను రెండు శాఖలుగ నేర్పడిరి. వీరికి పరస్పరవైషమ్యములు బాగుగ ప్రబలుటచే, ఒకశాఖవారింకొకశాఖవారిని వీలగునప్పుడెల్ల చిత్రవధపాల్సేయుచుండిరి. ఇంతియగాక అప్పుడు ప్రభువులు ప్రొటెస్టెంట్లయి యుండినయెడల కాతలిక్కులను, కాతలిక్కులైనయెడల ప్రొటెస్టెంట్లను చితులపై జేర్చి కాల్పించుచుంటయు నాచారమై యుండెను. ఇట్లే మన హిందూదేశమునను పూర్వము హిందూమతస్థులు బౌద్ధులను, బౌద్ధులు హిందువులను పలువిధముల బాధించిరనుట చరిత్రాంశమైయున్నది. శంకరుని కాలమందుగూడ అద్వైతులు బౌద్ధులను కఠినదండనపాల్జేసిరనుట మనకు తెలిసినవిషయమే. అట్లే విశిష్టాద్వైతులును అన్యమతములవారిని బాధపెట్టుచుండెడివారట. ఇక మహమ్మదీయుల పాలనమునందు కొరానును నొప్పుకొనని ప్రతిహిందువుడును తురుష్కఖడ్గమునకు బలియీయబడుచుండుట, తురుష్కులు హిందువుల నామముల నాకుచుండుట మొదలగు విషయములనుగూర్చి ప్రత్యేకముగ జెప్పబని లేదు.

మానసికస్వేచ్ఛ ప్రతిమానవునకును స్వభావముతో నుండు హక్కు. అట్టిస్వేచ్ఛ నతడు నిరాటంకముగ అనుభవించుటకు సంపూర్ణాధికారము గలిగియున్నాడు. ప్రతివిషయము

ను గూర్చియు తారతమ్యజ్ఞానమును వివేచనాశక్తిని గనబర చుచు నిష్పక్షపాతముగు బుద్ధితో దీర్ఘాలోచనముచేసినపిమ్మ ట నిశ్చితాభిప్రాయము నేర్పరచుకొనుటకు మానవుడు సం పూర్ణస్వాతంత్ర్యమును కలిగియున్నాడు. మతవిషయములం దుగాని, సాంఘికవిషయములందుగాని, నీతివిషయములయం దుగాని, రాజ్యాంగవిషయములయందుగాని పదిమంది యే త్రోవను నడతురో మనముగూడ ఆత్రోవనే నడువవలయు ననుట అశక్తిని పిరికితనమునుమాత్రము వెల్లడించును. ఎల్ల పుడును మనకంటె భిన్నాభిప్రాయులగువారితో కలసిమెలసి తిరుగవలసియున్నంతమాత్రమున వారు చెప్పిన దానినెల్ల సరి యనినమ్మి వారాచరింపుమనినట్లు మనమాచరింపవలయునను నియమ మెచ్చటను లేదు. ఇతరులు చెప్పునది సహేతుకముగ నుండిననే మనము వారి ననుసరింపవలయునుగాని లేనియెడల మనమేమాత్రమును నట్లొనరింప నక్కఱలేదు. ఒకనికి క్రై స్తవమతమునందును, మరియొకనికి మహమ్మదీయ మతము నందును, ఇంకొకనికి హిందూమతమునందును మంచి నమ్మక ముండిన నుండవచ్చును. ఎవనికి దేనియందు మంచియభిప్రా యము గలదో వాడామతమునే స్వీకరింపవలయునుగాని అ న్యునిమత మేమాత్రము నంగీకరింప నగత్యము లేదు. అంత మాత్రమున నాత డన్యమతస్థుల ద్వేషింపరాదు. ఇట్లే సాం ఘికవిషయములందును, రాజ్యాంగవిషయములయందును మ న మెల్లపుడును ప్రవర్తింపవలయును. అనగా మానవునకెట్లు మానసికస్వేచ్ఛ పుట్టుకతోనుండుచున్నదో, అట్లే అన్యమతస

హానమును గలిగియుండుటయు నతని విధియగుచున్నది. అం
దుచే మానసికస్వేచ్ఛగలవానికి పరాభిప్రాయసహనముండ
వీలులేదనికాని, పరాభిప్రాయసహనము గలవానికి మానసిక
స్వేచ్ఛ లేదనికాని చెప్పజాలము.

కావుననే అన్యమతసహనమును కలిగియుండి మానసి
కస్వేచ్ఛ ననుభవింప ప్రయత్నించుట మనవిధి. ఒక్క మాన
సికస్వేచ్ఛనే యనుభవించుచు అన్యమతసహనమును వీడితిమే
ని అనేకకష్టములు కలుగ గలవు. మనయభిప్రాయములు మన
కెంత మంచివనితోచినను కొన్ని సమయములయందు కారణ
యుక్తములుగ నుండకపోవచ్చును. మనయభిప్రాయము లట్టి
వని తెలిసికొనగలిగిన వెంటనే దానినివదలిపెట్టి సహేతుకము
లుగనుండు ఇతరుల యభిప్రాయముల నంగీకరింపవలసివచ్చు
ను. అట్టి సమయములయందా విధమున ప్రవర్తించుట మన
మేలునకేయని గ్రహింపవలయును. ఎల్లప్పుడును స్వేచ్ఛగ నా
లోచింపవలసినదేకాని అన్నివిషయములలోను మన యభిప్రా
యములే సరియైనవనిమట్టుకు తలంపరాదు. హేతువు ననుస
రించివర్తించు మానసికస్వేచ్ఛయే మానవుడు కోరదగినదై
యున్నది.

అన్యమతసహనము ముఖ్యమగు విషయములయందే
గాక అత్యల్పవిషయములని మనమనుకొనువానిలోగూడ నుం
డవలయును. ఇట్టి అన్యమతసహనములేని కారణముననే అనే
క కుటుంబములలో సోదరులు పరస్పరమైత్రినివీడి తగవులా
డుట తటస్థించుచున్నది. అన్నదమ్ములలో నిరువురొక విషయ

మును గూర్చి భేదభావములను గలిగియుండవచ్చును. ఎవనియభిప్రాయము వానికి సహేతుకముగ తోచుటచే వారిలో నెవ్వడుగాని తన యభిప్రాయమును వీడజాలడు. ఇంతటితోనంతమొందిన బాగుగనేయుండును కాని ఆవిషయము దానితో నంతరింపజాలదు. ఈయిద్దరిలో పెద్దవాడు తనతమ్ముడు తన మాట వినలేదనియును, చిన్నవాడు తనఅన్నగారు తనమాటను వినలేదనియును తమలోతమ కొకనియెడ నొకనకిగల క్రోధమును వృథగ బెంచికొందురు. కలహము పెరిగినకొలదిని నొకని నొకడు దూషింపుచుండుటయును, ఒకనితో నొకడు మాటలాడకుండుటయును చివరకు భూములను పొలములను గూడ పాడుపెట్టుకొని, ఒకనిపైనొక డభియోగమును దీసికొనివచ్చి న్యాయస్థానముల కెక్కుటయుగూడ సంభవమగుచుండుట మనము ప్రతిదినమును వినుచునేయున్నాము. దీనికంతటికిని కారణ మభిప్రాయ భేదమని కొందరనుకొనెదరు కాని, అభిప్రాయభేదమును సహింపజాలమి యని గ్రహింపవలసియున్నది. తమ్ముడు తనతో నేదయిన నొక విషయమున నేకీభవింపజాలకున్న, అట్టిదానిని అన్న సహింపజాలక వానితో కలహమునకు దిగుటయో, తనతో నేకీభవింపనందులకు అన్ననుదూషించి తమ్ముడతనితో తగవులాడుటయో పైనజెప్పిన నష్టములకన్నిటికిని మూలకారణమగుచున్నది. అన్యమత సహనము లేకుండుటచేతనే స్త్రీలలో స్త్రీలకును, విద్యార్థులలో విద్యార్థులకును స్వల్పవిద్యావంతులగువారిలో నొకనికొకనికిని మనము ప్రతిదినమును జూచుచున్న కలహము లనేకములు గలుగుచున్నవి.

తాము దృఢముగ విశ్వసించున దొక్కటి, తామితరులకు బోధించునది మరొక్కటి, యీవిధమున వర్తించువంచకులు లేకపోలేదుగాని, సామాన్యముగ ప్రతివాడును తాను సరియైనదని నమ్మినదానినే తనయభిప్రాయముగ వెల్లడించునే కాని, తాను నమ్మనిదానిని తనయభిప్రాయముగ వెలిబుచ్చడు. ఒకయభిప్రాయము సరియైనది కానియెడల ఆతని నాతప్పుత్రోవలోనుండి త్రొలగించి సరియగుమార్గమున ప్రవేశపెట్టుట యాతనిహితమునభిలషించు ప్రతిమానవునియొక్కయు విధి కాని, అతనియభిప్రాయము సరియైనది కాకుండుటచే నాతని దూషించి అతనితో కలహించుట యాతని హితుని విధి కాదు. పరాభిప్రాయసహనము లేకుండుటచేతనే అనేకములగు నష్టములు కలుగుచున్నవి. అన్యమతసహనము లేమిచే, కొన్నిసమయములయందు గాఢానురాగయుతమగు దృఢమైత్రికూడ వినాశకరమగు ద్వేషముగ బరిణమించుట మన మెరుంగనిది కాదు.

ఇట్టి కష్టపరంపరలకు పుట్టినిల్లయిన అన్యమతద్వేషమును చేతనయినమట్టుకువిడిచి వర్తించుటకు ప్రతిమానవుడును యత్నింపవలయును. స్వల్పవిషయములయందుగూడ మానవస్వభావజనితమగు మానసికస్వేచ్ఛను యుక్తరీతి ననుభవించుచు, పరమతద్వేషమునుమాత్రము వీడి నడచుకొనుట విద్యావంతునియొక్కయు నిజమగు నాగరికత గలవానియొక్కయు లక్షణము.

---

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె. 1915.

గీ॥ "ఉద్ధరించెదదేశమేనొక్కరుడనె । నిశ్చయంబిది సేయంగనేరడొరుడు"
అనుచు "విలియమువి" ట్టనునతడుపలికె।అట్లెయెల్లరుదలపగ నగునుశుభము॥

# అమితత్వము.

మితిమేరలులేని వృద్ధియును బాగుపడనేరదు. ఆహారము ప్రాణుల కత్యవసరమనియు నదిలేకున్న లోకయాత్ర గడువద నియు నందరెరుగుదురు. వేళకు భోజనము దొరకనియెడల శోషజెంది యేపనిని ఒనర్పజాలకుందుము. అందుచే ప్రతివా డును వేళకింతభుజించి ప్రాణమును నిలువబెట్టుకొనజూచును. ఇట్లు మనుజులకేగాక మృగములకును పక్షులకునుగూడ ఆ హారము దొరకుటత్యవసరము. కాని వానికిని మనుజులకును ఆహారము దినుటలో విశేషము భేదము కలదు. ఎంతఆహార ము దొరకినను, ఇతరజంతువులు వానికి కావలసినంతమట్టున కే తినును. మనుజులన్ననో. ఎచ్చటనో ఒకరిరువురు దప్ప త క్కినవారందరును రుచ్యములగు భోజ్యములు దొరకినచో నే మాత్రమును వెనుదీయక పొట్టపట్టినకొలదిని దినుచుందురు. అందువలననే ఇతరజంతువుల కెన్నడును కలుగని అజీర్ణవ్యా ధి వీరినిబట్టి వేధించుచుండును. మానవులకు బాధించు పలు రోగములకీ అజీర్ణవ్యాధియే మొదటికారణమని వైద్యశా స్త్రజ్ఞు లభిప్రాయపడుదురు. అన్నరసము నెత్తికెక్కుటచే వ్యాధి ప్రాణాపాయకరమైనదని అనుకొనుచుండుట మన మ నేకసారులు వినుచున్నాము.

ఇట్లే నల్లమందు, బ్రాందీ మొదలగువస్తువుల నౌషధములుగ సేవించిన నెంతలాభము కలుగునో, వానినే ఎక్కువగ నలవాటుచేయుటచే మానవుల కెట్టి కష్టనష్టములు ప్రాప్తించునో ఎవ్వరును ఎరుగనివిషయము కాదు. దినమునకు అయిదారుగంటల నిద్రయును, సామర్థ్యమునకు తగిన శరీర పరిశ్రమయును దేహారోగ్యమున కత్యవసరములే, కాని అట్లని ఎల్లప్పుడును నిదురపోవుచుండిన పనులన్నియు నష్టపడుటయే గాక బుద్ధిమాంద్యమును జనించును. ఒకనాడే బలశాలి కావలయునని మితిమీరిన పరిశ్రమయొనర్చినచో బలమునకుమారుగ అధికాయాసమును నాపై బలహీనతయునుగూడ జనించును. కాయకష్టము చేయువారికిని, రాత్రింబవళ్ళు ఉద్యోగము చేసి విసిగియుండువారలకును, కొంచెము సేపు స్నేహితులతో పలువిషయములను గురించి ముచ్చటించుటయు, నప్పుడప్పుడు చదరంగము, చీట్లపేక మొదలగు ఆటలాడుటయు గూడ నెంతయు ఆహ్లాదము కలిగించి మరల పనిచేసికొనుటకు ఉత్సాహము నిచ్చును. కాని వేళ నెరుగక ఎల్లపుడును ముచ్చటలాడుటయు, తగవులు పెరిగి లేవవలసివచ్చువరకును చీట్లాటలాడుచుండుటయు నేమాత్రమును తగదు.

ఇదేవిధమ్మున ఘన కార్యము లొనర్పవలెననియును, తనకు కావలసిన ధనధాన్యాదుల సంపాదింపవలయుననియును మానవు డాసపడు టెంతయు మంచిది. తనకగత్యము లేనివాని నయితము సంపాదింపవలెననికాని, అవసరములగు వస్తువు నధికముగ సంపాదింపవలెనని కాని యనుకొనుట మాన

వునకుగల అత్యాసను తెలియజేయును. జలమునందలి తన నీడను జూచి రెండవమాంసపుముక్కనుగూడ పట్టుగొనవలెనని నోరు తెరచుటచే తన నోటగల మాంసపుముక్క నందున జారవైచుకొనిన పేరాసగల కుక్కకథ మన బాలురకును తెలియును. వెనుకటికాలమున నొక మనుజునకు దైవము ప్రత్యక్షముకాగా తాబట్టినదెల్ల బంగారగునట్లు వరమును బడసెనట. అంత నాతడు ఉదయముననే లేచి అత్యాసతో నింటగల వస్తువులనెల్ల బంగారుగ మార్చుచుండెను. కాని తినబోయిన కూడును త్రాగబోయిన నీరునుగూడ బంగారమగుటచే నాకలిబాధపడజాలక భగవంతుడా నాకీ వరమెట్లు పోగలదని మరల నాతడు ప్రార్థింపసాగెను. అత్యాసకు బోయిన నదివరకున్నది సయితము పోవునని మనకీ కథల వలన బోధపడగలదు.

ఏపనినిగాని ప్రారంభింపకపూర్వము దానిని గురించిన ఆలోచనయును, మొదలుపెట్టగలుగుట కావశ్యకమగు ఉత్సాహమును ప్రతివానికిని ఉండవలయును. అట్లుగాక ఏమాత్రమును ఆలోచింపక అత్యుత్సాహముతో పని ప్రారంభించి తరువాత దానిని నెరవేర్ప జాలకపోవుటయు, ఎట్లు ప్రారంభింపవలయునా, ఎట్లు కొనసాగింపగలమా యని ఎప్పటికిని తెగని దీర్ఘాలోచనయొనర్చుచు నే వేళకును దానిని మొదలుపెట్టకుండుటయు గూడ పని నెరవేరకపోవుటకే కారణములు.

దుర్మార్గులయెడ కోపమును, పెద్దలయెడ వినయమును ఇతరులయెడ గౌరవమును గనబరచుచుండుట సజ్జనునకు

లక్షణములు. కాని దుర్మార్గుడు తగిన శిక్షవలననో మరే కారణముననో తన నడతను మార్చుకొనినమీదట గూడ నాతని యెడ కోపము కలిగియుండుట యెట్టివానికిని తగదు. ఎల్లపుడును కోపముకలిగి యుండువాడు ముక్కోపి యనిపించుకొనును. ఇక అతివినయము ధూర్తలక్షణము. అట్లే మానసికస్వేచ్ఛయు, ఆత్మగౌరవమును ప్రతివాడును కలిగియుండవలయును. కాని మానసికస్వేచ్ఛ గలవాడనిపించుకొనదలచి ఎల్లపుడును అన్యుల అభిప్రాయములకు విరుద్ధముగనే చెప్పుచుండుటయును, ఆత్మగౌరవము కలవాడనిపించు కొనుటకై ఊరక విర్రవీగుచు, క్రిందుమీదులు కానకుండుటయును ఎట్టివానికిని తగదు.

వీనినన్నిటినిబట్టి చూడ ప్రతివాడును “అతి సర్వత్రవర్జయేత్” అనులోకోక్తిని మరువక ప్రవర్తింపవలయునని తెలియుచున్నది.

# OPINIONS.

**Rev. J. Roy Strock, M. A.,** GUNTUR, INDIA
*Principal.* *21st January, 1915.*

" I hereby certifiy that I have been acquainted with the aims and working of the Gnana Prasadini Society from its beginning..............The pamphlets issued by the Society seem to be on subjects very usefull to village communities I myself shall see to the auditing of the accounts of the Society..............................

I feel that the Society deserves encouragement in the work which it is trying to do. "

(Sd) J. ROY STROCK.

**M.R.Ry. J. S. Narayanamurty garu M. A.**

" The 'Gnana Prasadini' tracts that are being published at Guntur and not only distributed locally but sent to various Telugu-speaking places for circulation are the work of some enthusiastic youngmen who are well-qualified to undertake it and continue it to the unquestioned advantage of students in general and even of many elders.

" The work has been organised by a few youngmen whom I personally know......They are very enthusiastic and display an ardent interest in the programme they have laid down for themselves. It is my sincere conviction that tho"

they are young they are yet very thoughtful, and entertain high ideals of life and work. They possess, likewise, the steadiness and equilibrium necessary for systematic and sustained work. I have much confidence in their discrimination.

"The neat, though somewhat plainly got-up pamhlets, that are being issued once in every fortnight contain solid matter. Usually they extend over eight pages and give valuable information on very important topics. The treatment of the subjects is very refreshing, Each is handled analytically, the ideas following one another in their natural sequence; and the whole arrangement is such as to reflect credit on the author's sense of logical fitness, The illustrations chosen are always apt and at the sametime very simple so as to be understood by the most ordinary readers.

... ... ... ... ... ... ... ... ... ...

The expression is direct and forcible and is happily free from all encumbrances of "ornateness." While the effort at grandeur and embellishment is totally absent the striving is visible on every page to make the abstract and somewhat complex notions of Ethics yeild to the demands of simple and lucid prose diction. In short, as the aim of these writers is entirely practical, so everything else is subordinated to this interest and is made to accord with it as much as possible.

"The matter given in these pages is undoubtedly of great value not only to students of all classes but to many others with greater pretensions to culture. I am really glad that youngmen just entering life have an opportunity of reading these well-written expositions and getting the sort of mental stimulus most useful to them in their dealings with the world. I am sure these tracts will do immense good to all those that have the patience to go through them and to ponder over some of the thoughts therein contained."